శ్రీ

# లలిత.

(నవల)

గ్రంథకర్త:

దేవమణి సత్యనాథన్,

మదరాసు.

ద్వితీయ ముద్రణము 5000 ప్రతులు.

బి. ఎన్. ప్రెస్,

మదరాసు.

1927



 [వెల 0—10—0.

# కృతి సమర్పణము.

---

సీ॥ పసితనమ్ముననుండి ♦ పరమవిద్యల నెల్ల
ఘటియింపఁ జేసిన ♦ ఘనులుగారె
సమయోచితమ్మైన ♦ సన్మార్గవృత్తిని
నెలిమిమైఁ గఱపిన ♦ హితులుగారె
దివ్యాత్ము నేసుని ♦ భవ్యచారిత్రముల్
కరము బోధించిన ♦ గురులుగారె
అన్నివేళలఁ గడు ♦ నాదరమ్మున నన్ను
బెంచిన హితకర ♦ ప్రియులుగారె

శాంతిదంపతులగుచు స్వ ♦ చ్ఛందపదము
నందితిరి గారె మీరుహ ♦ న్నమ్మ—దేవి'
డనె మాతలిదండ్రు లసమవి ♦ ఖ్యాతయశులు
గాన నర్పింతు నికా—వ్య ♦ కన్యఁ గొనుఁడు॥

— గ్రంథకర్త

# PREFACE TO SECOND EDITION.



The reception accorded to the first issue of this novel has been very encouraging so much so that the writer was the happy recipient of many testimonials from eminent Telugu Pandits and others engaged in educational service, besides appreciative criticisms from many readers. In answer to repeated calls for a re-issue of the book, the writer was contemplating a second edition when the S. S. L. C. Board announced it as an A Group Telugu Text for the S. S. L. C. Examination of 1928.

Though the consideration of its adaptability as a school Text has necessitated certain eliminations and filling up of such gaps, yet the virgin purity, vividness and simplicity of style and the placid but forcible run of the impressive story remain uncontaminated.

Advantage has been taken to purge the text of a few inaccuraoies ; and a higher standard in printing and in the entire get up of the book has also been aimed at.

Author.

# ఉపోద్ఘాతము.

---

"లలిత" యను నీ కల్పిత గద్య గ్రంథమును రచించిన కవయిత్రి దేవమణియను స్త్రీరత్నము. ఈమె ధర్మవర పురవాస్తవ్యురాలు. హిందూక్రిస్టియన్ తెగలోఁ జేరినవనిత. దేశచరిత్రమునుండి యొకానొక విషయమును సంగ్రహించి పెంచి, పెద్దజేసి, కథనంతయు గల్పించి వ్రాయు నాచారమును వదలి యీమె యాద్యంతము కల్పనము వలననే కథను బోషించెను. జాతిమతములను విమర్శించి చెప్పకున్నను కథాభాగము నందలి పాత్రములను వారి నివాసస్థానములనుఁబట్టి చూచిన నీప్రబంధవృక్షమునకు నాంధ్రదేశ మాలవాలమని చెప్పకతప్పదు. హరిదాసు కథానాయకుడు, లలిత ప్రధాననాయిక. లలితాకాంత సౌరదర్యమును, మార్దవమును, హరిదాసునెడ నామెకైన శుద్ధప్రణయమునుఁగూర్చి తటస్థించిన యంతరాయములనెదిరించి నిలుచుటయందామె కనపఱచిన యసమాన ధైర్యమును, స్వార్థత్యాగబుద్ధియు, భక్తిపరతయులోనగు గుణములు చక్కఁగాఁ బోషింపఁబడినవి. పరోపకారదీక్ష, ధీరహృదయము, పరిశుద్ధప్రేమ, భావస్వాతంత్ర్యము లోనగు మహాగుణములతో హరిదాసు సర్వజనాశ్లాఘాపాత్రుఁడై విలసిల్లుచున్నాడు. వసంత జయంతులును, పిదప వామనజయంతులును, పెట్టిన కష్టములకై, యొకించుకయైన జంకక నిశ్చలమనంబున నిలిచి హరిదాసు నిష్కళంక ప్రవర్తనమున ధీరనాయక

త్వమును నిల్పుకొనుట యెంతయు సహజముగా వర్ణింపఁబడినది. సోమనాథుని పాత్రపోషణము చక్కఁగానున్నది. ఇందు తాగుడను పెనుభూతము తొలుఁదొల్త నార్యకుటుంబములలోనికి వచ్చుజాడలను, వచ్చి అది నెలకొను మాదిరియు నెలకొని కావించు విపత్తులును, కావించి తుట్టతుదకు సంసారమునే భగ్నముగావించు సన్నాహమును సమగ్రముగా వర్ణింపఁబడినవి. సోమనాథుఁడు లలితకు పెట్టిన కష్టములు చదివిన ద్రాగుఁబోతు లెట్టిదార్భాగ్యమునకైన వెనుదీయరని స్పష్టపడుచున్నది. గ్రంథముల వ్రాయుటకిది ప్రథమప్రయత్నమని గ్రంథకర్త్రియే చెప్పుచున్నది. హిందూక్రైస్తవ ప్రభవయు కాంతయు ననునంశము లీగ్రంథమునకు వన్నెను హెచ్చించుచున్నవి. విద్యనేర్చినదానికిఁ దోడును, గ్రంథరచనకుఁగూడ గండఁగి యుత్సాహముతో నీపొత్తమును వ్రాసి యీవధూమణి మామాడలములోని స్త్రీలకు మార్గదర్శినియై యందఱికృతజ్ఞతకుఁ బాత్రురాలగుచున్నది.

ఈ దేవమణి వధూఁటి యింకను విద్యనభివృద్ధి చేసికొని సాంఘికములైన నవలలను ననేకములవ్రాసి తానుకీర్తినిగడించుచు నాంధ్రభాషాసేవ చేయుచుండునుగాత.

కరుణామయుఁడగు నీశ్వరు డీమెకాయురారోగ్యైశ్వర్యముల ననుగ్రహించునుగాత.

కూరం నరసింహాచార్యులు, బి. ఏ., బి. యల్.,

తాలూకాబోర్డు ప్రెసిడెంటు,

ప్రొద్దుటూరు.

# లలిత

## మొదటి ప్రకరణము.

ప్రచండ మార్తాండుని ప్రతాపమడఁగ నరుణకిరణములయందలి యుడుకాఱిపోవుచుండు సమయమునఁ బక్షి సంతతులు శ్రేణులుగట్టి తమతమ యిరవులం జేరవలయున నెడి యాతురముతో వినువీధి నరుగుచుండెను. కాకములు కావు కావు మని యఱచుచు నప్పుడే వచ్చి చెట్లపైఁ గూర్చుండి విశ్రమింపఁ దొడఁగెను. ఘూకములు తామున్న నెలవులవీడి యెప్పుడేగుదుమాయని యవసరపడుచుండెను. కొందఱువృద్ధులు తాము పగలంతయుఁ బనిపాటల నలసినందున హాయిఁగోరి కమ్మతెమ్మెరల కెదురుగా నడవఁజొచ్చిరి. బాలికాబాలకులు బళ్లయందుఁ దమయొజ్జలకడఁ మానసికపరిశ్రమమున నలసి యప్పుడ పాఠశాలలుమూయ బయటఁదిరిగి తమ యిష్టానుసారముగా నాటపాటలఁ గడపఁ దమహితులం గలసికొని బాటలవెంబడిఁ బరువిడసాగిరి. పుష్పసౌరభముల నాకర్షించి గంధవహుఁ డల్లనల్లన వీచుచుండ వృక్షాగ్రములయందలి చిగురుజొంపములు చలించుచు నూతన కాంతుల విరాజిల్లుచుండెను.

ఇట్టి సంపద కాకరమగుటచే సమస్తజీవహృదయ భావోదయంబులకును సాంధ్య రాగసమయమునకు నెద్దియో సంబంధమున్నదనియే తోఁపకమానదు. కాన సకలప్రాణులకు సంతసం బొదవింప సాంధ్యమమే తగుసమయంబనుట సుప్రసిద్ధము.

ఇట్టి సమయంబునఁ బదియేడుల యీడుగల యొక బాలిక పురపరిసరంబున నున్న నుద్యానవన సమతలమందలి యొక వేదికపై నిలుచుండి, ,, ఇదే నేఁగన్నులఁ గట్టుకొను చున్నాను. మీ రేర్పఱచుకొన్న సంకేతస్థలములందు మీరు దాఁగసగు. ఒక్క మాట మాత్రము మీకు నొక్కి వక్కాణించుచున్నాను. కంటకయుతంబులగు నికుంజపుంజములందు మీరుణఁగిన కుసుమకోమలములగు మీ మేనులకు బాధకర మగునుండును. కానఁ జెట్ల చాటులందును, ఊతయిఱుకుల యందును దాఁగిన యనువు. నేనాడినమాటలన్నియు మన మాఁడెడియాట కనుబంధముగ నుండవలెను. అటుగాకున్న నే నీయాట నాడనొల్ల " నన నందొక బాలుఁడు ,,నీవే కన్నులఁ గట్టుకొన స్వతంత్రవు కావ" నెను. ,,అఁటవిషయములం దీమె మాట లంగికారము లేగాని పద్ధతుల ననుసరింపక యిష్టాను సారముగ వర్తించిన మాయాటయందుఁ నినుఁ జేర్పఁమని ద్వితీయుఁడనెను. ఆ సమతలమందనేక బాలికాబాలకు లీయా టయందు భాగమునుగొన నాసతోనుండిరి. కాని యా ముప్వరి ముఖచిహ్నములఁగాంచినచో, వారలేక గర్భవాసులని వెల్లడి యగును. వారియం దగ్రజుఁ డాటకంతయు నగ్రగణ్యుఁడైయుం

డఁగోరి వారందరితో "ఈ యాటయందు నేఁదల్లిగానుండెద. మీరందఱు చాలుగా నిలుచుండుఁడు" అనెను. అందఱు నట్లొ నర్చిరి, క్రీడాకర్తయైన ప్రథముఁడు తన రెండు హస్తములందలి తర్జనీలనడుమ నొక వస్తువును దాఁచినా వ్రేళ్లందఱు పట్టుకొ నుఁడనెను. ఒకఁడు బొటనవ్రేలు, మఱియొకఁడు చూపుడు వ్రేలు, నింకొకఁడు నడిమివ్రేలు, బాలికమాత్రము తర్జనీ వేఱొకఁడు చిటికెనవ్రేలు నింకనువారి వారికిష్టమైనటుల నా బాలుని యంగస్పర్శముఁ గావించియుండిరి. దొంగఁగ నుండవ లెనని యాసించియుండిన బాలికయె దొంగయని నిరూపించుచుఁ బ్రథముఁడు తన తర్జనుల నడుమ దాఁచిన గురుతు నందఱకు జూపెను. అందఱును జప్పటలు చఱచుచు నవ్వసాగిరి. "తల్లి బాలుసు 'రమ్మ! నీ కోరిక యీడేఱినది. ఇప్పుడు కన్నులు గట్టెద" ననెను. బాలిక విషణ్ణవదనయై వేదికపైఁ గూర్చుండెను. బాలిక కన్నులు మూయఁబడెను. తక్కిన వారందఱు నింతకుమున్నె రహస్యస్థలములను జూచుకొని యుండిరి. వారిపుడు వేర్వేఱు త్రోవలననుసరించిపోయి దాఁగుకొని యింకఁ గన్నులు విడువుమని సంబోధించిరి. ప్రథముఁడు నయనములపైని జేతులను దీసెను. బాలిక ప్రత్యక్షమున నెవరును లేకుండుటఁగాంచి, వారిని వెదక నారంభించెను.

పాపము! బాలిక నడచుచున్నది. అందందు వెదకుచున్నది. చెట్లచాయలఁ బరికించుచున్నది. పొదలఁదూరుచున్నది.* నిక్కిచూచుచున్నది. విసుగుఁజూపుచున్నది. వెతను జెందుచున్నది. కస్తిఁగనుచున్నది. ఆయాసమున నిట్టూర్పు విడుచు

చున్నది. చెక్కులయందుఁ బొడమిన లేఁజెమటను పైటచెఱఁగుచేఁదుడుచుకొనుచున్నది. మరల వెనుదిరుగుచున్నది. వారెందున్నవారని తల్లిబాలు నడుగుచున్నది. బతిమాలుచున్నది. కాని వాఁడుచెప్పఁడయ్యె. మరల వెదకఁబోవుచున్నది. ఏమొనర్చిననేమి! ఎంతతిరిగిననేమి! ఎచట వెదకిననేమి! విఫలమనోరథయైనది. ఎవ్వరు నాబాలిక కంటఁబడలేదు. వారెం దరిగిరో! బాలిక నలయింపనెంచి, మోసమున ముంపనెంచి, తమచాకచక్యమును జూపనెంచి, వారందఱి యొకవనమునఁ జేరియుండిరి. బాలిక వెదకుచునే యుండెను. తక్కినవారలలోఁ గొందఱు సరసిచెంతను, నొకఁడు విటపిచాయను, నింకొకఁడు శాఖల మధ్యను దాఁగియుండిరి. ఒకబాలిక పుష్పాపచయ మొనర్చుచుండెను. మఱియొకబాల పక్వఫలముల నారగించుచుండెను. వేఱొకబాల యుద్యానవనరామణీయకమును గాంచుచుండెను. వేళయతిక్రమించుచుండ నరుణదిగ్భామినికి వాసరుండతిప్రీతి నంపిన కెంప్రపూబంతియనంగ నపరతిశైలాంత రమ్యహర్మ్యతలాగ్రింబుల కర్పితమగు దర్పణంబనంగ నభోసుందరి సుగుణరత్నాకరుని శుభముగోరి మేలిరతనాలుగూర్చిపట్టిత్రిప్పెడు పళ్లెరమోయన నర్కుఁడపరశైలంబునఁ గ్రుంకెను. సూర్యుఁడరుగ సమయాంగన యల్కవహించి నీలాంబరముధరించెనోయన కాఱుచీఁకటులు నలుదెసలం గ్రమ్మెను. రేకాంత చంద్రాగమమునునిరీక్షించుచుండెను. బాలిక వనతలమువంక రాదయ్యెను. చీఁకటులు గ్రమ్మినను భయమందఱకు దోఁచుచుండెను. వారాయారామమును వీడిరి. తల్లిబాలునియంటుదమనిపోయిరి!

పోయిననేమి! బాలిక వారికిఁ గనఁబడదయ్యె. అయ్యో! ఎందరిగనదో.

# రెండవ ప్రకరణము

ఆంధ్రరాజ్యమున కీశాన్యమూలనుండునది కళింగరాజ్యము. మన్యసీమ కళింగరాజ్యమున నొకభాగము. విజయనగరము మన్యసీమలోనిది. అనాగరకుల కాటపట్టగు నీవిజయనగరము కొన్ని సంవత్సరములక్రిందటనే, యాంగ్లేయపాలనాధికారమునకులోనై యిప్పు డుత్తర సర్కారులని పిలువఁబడు మండలములోని, గోదావరీ మండలమునకుత్తరముననొక జమీనుగానుండునదే. ఈ విజయనగరపు జమీందారికి ముఖ్యపట్టణము విజయనగరము. ఆంగ్లేయపాలనమునకు లోఁబడని కాలమం దీవిజయనగరము, కర్కశపాషాణంబుల కాకరంబగు కొండలచేతను, కంటకావృతంబులగు జాంగల ప్రదేశంబుల చేతను, నగాధములగు లోయలచేతను నిండి మోటుజాతులగు ఖాండులు, కోదులు, సవరులు, థగ్గులు మున్నగు నాటవికజాతికి స్థానమైయుండెను.

రాజ్య మాంగ్లేయులపాలఁబడినను దిన దినమునకు నాగరకత లెక్కుడైనను, నీయాటవికుల దుండగములు మాత్రము, నానాఁటికి, తక్కువగాక మిక్కుటంబు లగుచుండెను

ప్రభుత్వమువారు వీరి దుండగముల నడఁప నెన్నియో ప్రయత్నములు చేయుచుండిరని దేశచరిత్రములు నానాముఖముల నేఁటికిని ఘోషించుచున్నవి. వీరిదాడి దొలఁగించి, ప్రజారక్షణము సేయఁగోరి, యాంగ్ల ప్రభుత్వమువారు రక్షకభటవర్గము నెడతెగక, యీమన్యసీమయందందుఁ గాపుదలగా నిల్పి యుండెడివారు. అట్టి రక్షక భటవర్గమునందు సోమనాథు డున్నతోద్యోగియని చెప్పుట సిగ్గుచేటు. ఇతఁడు చామనచాయఁగల యేఁబదేండ్ల మనుష్యుడయ్యును దేహదారుఢ్యముఁగలిగి శైలమర్దన సహాయ్యమునఁ దలవెండ్రుకలును, పుస్తీలును, తెలుపు మూపకుండుట చేత నడివయసునువానివలెఁ గాన్పించుచుండెను.

ఈఁతడు మధుపాన మత్తుఁడు. వేతనముకన్న వెచ్చము లధికముగా నుండుటంబట్టి యాతఁడు బీదల కొంపలఁగూల్చియు, ప్రజల బెదరించియు, లంచములఁ గొనియు, వందల కొలఁది ద్రవ్యమును గ్రహించుచుండెడివాఁడు.

తన యార్జితమునఁ గొంతమాత్ర మతికష్టముతోఁ గుటుంబపోషణార్థము వ్యయము చేసి, యాతఁడు మిగత ద్రవ్యముతో దానాడిన దేయాట పాడిన దేపాటగా దుర్వ్యయముఁ జేయుచు స్వేచ్ఛయునతి విలాసముగా గాలముఁ గడుపుచుండెను. ఈవినోదపురుషుఁడు పౌరలకేగాక మన్యసీమయందలి యాటవికులకు గూడగుండెగాలమై యుండెనని పాఠకులకు వేఱుగాఁ జెప్ప నవసరము లేదు.

అక్కాలమునఁ బెక్కుమందికి విద్యరానందున నీ తఁడు నాగరకుల నందఱ లోఁబఱచుకొని తన యిచ్చమేరకు నధికారము సాగించుటచే నాతని గౌరవమునకు నించుకేని కొఱఁత లేకుండెను. పుష్పాలయన్నిట వన్నెగన్న రోజాపుష్పములు ముండ్లచెట్లఁ బుష్పించినరీతి. నితనికి గుణవంతులగు నిరువురు పుత్త్రులును నిరువురుఁ బుత్త్రికలును గలిగిరి కడచిన ప్రకరణము నందుఁ జదువరు లెఱిగిన విశాల సమతలమందలి వినోదగోష్ఠి నుండిన యాబాలికా బాలకు లీమహానుభావుని బిడ్డలే.

పిల్లలింకను గృహమునకు రానందున నొక పరిచారిక వారిని బిలువ నావనస్థలి కభిముఖయై వచ్చుచు దూరమందొక పొదచాటునఁ బడియుండిన బాలికం గాంచి "ఇదిగో! మా లలిత! ఏలకో క్రిందఁబడి పొరలుచున్నది! సహోదరు లెందరిగిరో 'దైవమా! లలితకేమి కీడుమూడెనో" యని యనుకొనుచు సత్వరముగ నామెనుడాసి లలితా! లలితా! యని పిలుచుచు "అయ్యో! ఎంతపిలిచినను బలుకదు, తట్టినగదలదు, కన్నుల దెఱచి చూడదు, నోటచొంగలు గ్రిక్కుచున్నది. దేహామంతయుఁ జెమ్మట గ్రమ్మియున్నది. ముఖవికాస మంతరించినది. కట్టా! ఇందెవ్వరును లేరైరి. ఇఁకఁ జేయవలసినదేమి?" యని వాపోవఁ జొచ్చెను.

ఈమె సోమనాథుని కడఁగొట్టుకూఁతురు. దాఁగుడుమూతలందు బాలికా బాలకుల వెదుక బోయిన యాబాలికయే

యీలలిత, పరిచారిక రోదన మింతకుమున్నె లలిత నారయుచుం డిన సహచరుల చెవికంబెను. వారందఱిగిరి.

ప్రథముఁడు—మా లలిత కేమి?

పరిచారిక—ఏమో నాయన! నాకేమి తెలియును? చీఁకటి పడినను మీరింటికి రానందున, వెదకవచ్చి యిందీమెనీదుస్థితి లోఁ జూచుచున్నాను.

ద్వితీ—అయిన మాలలిత మాటాడదా?
పరి—అన్నా! మతిబోయినది. మాటాడదు.
ద్వితీ—అట్లయిన గతియేమి?
పరి—నాకేమియు దోఁపకున్నది.

బాలికాబాలకు లామెచుట్టును మూగియుండిరి. పరిచారికతోడలలితమఁ దలగ్రడగానుండెను. లలితయన్నలుదిక్కుతోఁపమి చుట్టుచున్న బాలురను దూరముగా నిలువుఁడని సంజ్ఞలుచేయుచుండిరి. పరిచారిక లలితదేహమంతయుబరికించుచుండెను. లలిత పాదమందొకగాయ మామెకంటఁబడెను. ఆగాయమునుండి ధారలు ధారలుగా రక్తము స్రవించుట నామె కనుగొనెను. అనుమానించెను. పార్శ్వభూమిని దిలకించెను. అదియుంతయు సైకతస్థలిగానుండెను. ఆయిసుకయందలి జాడలవలన నామెకేదియో సందేహ మొదవెను. ఎట్టయెదుట నొకపొదరిల్లుండినది. ఆమె తన వీక్షణమొకపరి నాపొదపై బఱపెను. ఆదొక చెడుపు రామెకంటఁబడ నిట్లనెను.

"నాయనలారా! మనలలిత సర్పదష్టయయినది. ఈమెనింటికిఁ గొనిపోవుట యవసరము" అని యా బాలికను భుజముపై కెత్తుకొని పరిచారిక గృహమునకేగెను.

అందఱును దలకొకరీతిగా నాయపాయమునుగూర్చి విలపించుచు నామెను వెంబడించిరి. లలిత చాలసువమారె. ఆమెకిపుడు తటస్థించిన యాపద ప్రాణాపాయకరమైనది. గృహాంగణమునఁ గూర్చుండిన సోమనాథుఁడు పరిచారికనుగాంచి "ఏమి ఏమి! లలితకేమి సంభవించె"నని ప్రశ్నించెను. లలిత సర్పదష్టయైనదని పరిచారిక చెప్పెను. ఈవార్తవిని గృహమందున్న లలితతల్లి ఎదబాదుకొనుచు "కుమారీ! కుమారీ! నా కట్టెదుట లేకుండ నీవేలయందఱిగితివి? నాగతియేమి! ఇకనే నెవ్వరిం బిలుతును. తల్లీ నాకడుపు గాల్పజూతువా" యని విలపించుచు తటాలునవచ్చి యాబాలనెత్తుకొనెను.

ఇంతలో సోమనాథుని చేఁబంపఁబడిన మనుష్యులు వైద్యునితో నింటఁబ్రవేశించిరి. వైద్యుఁడా బాలికను బరీక్షించి శయ్యాపార్శ్వముననుండిన యామె తల్లిదండ్రులకు ధైర్యముచెప్పి శైత్యము మించినందున నుష్ణముగలుగువఱకు నీయౌషధముచే కాలుసేతులు మర్దనముసేయుడని యిచ్చి యతిజాగరూకతతోఁ బదునైదునిమిషములకొకసారి యాబాలికచే మందునుగుడువఁ జేయుచుండెను. ఇన్ని శైత్యోపచారములు చేయుచుండినను బాలికకింకను స్పృహరాలేదు. తుదకా బాలికగతి యేమగునో!

---

# మూడవ ప్రకరణము

"అదోండసీ! కాళెమ్మగుడి" యని యొకఁడనెను. "గల గలమని గంటల్లాడిచ్చుచుండారసీ" యని మఱొకఁడనెను. "బిరబిరపదండసీ! యని వేఱొకఁడనెను. "ఆనాకొండె పోలీసు పెద్దోనెన్నడెసేమసీ" యని వారిలో నింకొకఁడనెను. వీరిలోఁ గడపటితూరి మాటాడినవాఁడు గుంపునకంతకును నాయకుఁడు గాఁబోలు. వీరందఱిట్లుకొనుచు మన్యసీమ లోయంబడిపోవుచుండిరి. చూచుటకు వీ రాటవికులవలెఁ గాన్పించుచుండుటంబట్టియు, వీరి వేషభాషలను బట్టియును జూపఱకు వీరుభిల్లుల వలెనుండిరి.

తమ హస్తములందుండిన చంద్రాయుధములు, గండ్రి గొడ్డండ్లు, బల్లెములు, బాఁకులు, మున్నగు నాయుధములఁ గాంచిన సామాన్యులగు మానవుల గుండెలవియవలసినదే కాని జనసంచారమున కనువుగాని త్రోవల వీరు నడచుచుండుట చేతను, జండికను బలినియ్య మేటిపొట్లేళ్లను తమ వెంటఁగొని కాళికాలయమున కరుగుచుండుటవలనను యధ్వగులు భీతిఁ బాయుచుండిరి.

దేవతాపూజారంభ సంరంభముం జాటు వాద్య

ఘోషంబు లతిశయించుకొలంది, పదగమన మతిశయించు చుండెను. వీరశంఖారావమును, దుందుభిమ్రోతయును విని వీరింకను నుత్సాహమునఁ బరుగిడనారంభించిరి. వీరికని నాల యమునకును దూర మొక్కమైలు మాత్ర ముండెను. మహేంద్రగిరిపైనున్న గుడి యంతయెత్తైనదికాదుగాని యది యత్యున్నత శిఖరాగ్రముల చెంతగట్టఁబడియుండుటచే మిక్కిలి యెత్తుగాఁ గన్పట్టుచుండెను. ముఖమండపమంత విశాలమైనది కాదుగాని యిరుపార్శ్వముల యందును వృక్ష శ్రేణు లతిశయించుటచే వేనవేలుగా నచటికరుగు యాత్రికులకు నిలు చుట కనుకూలముగ నుండెను. ఆమడలకొలఁది దూరమున కా యాలయము గోచరమగుచుండెడిదే గాని చుట్టునున్న ప్రాకారములచే మహాద్వారమునుండియే వీక్షించుటకనువగుట నందలిగర్భగుడి మైలుదూరమునకు మాత్రమే కాన్పించు చుండెను.

చదువరీ! ఈవర్ణన మహేంద్రగిరి కించుకేనియు శోభ నిచ్చుటలేదు. నీవెంత చదివినను నీకానందము తోఁచుటలేదు. నీవు మనోవేగమున నొక్కగంతువైచి, మహేంద్రగిరి కాళికా లయమునుజేర మమ్మనుసరింపుము. సుస్థిరుండవై నీమనోనేత్ర మును విప్పి యాజగదంబను గన్నులార వీక్షింపుము. అదిగో! సాయంకాల సమయరాగ సదృశమై యరవిందమున కెనయై పోలుపారు వనదవమండలము, నింతుకలువలహసించు నేత్రద్వ యమునుండి వెలువడు నాతీవ్రవీక్షణములు సింహ మధ్యము

నధిష్ఠింపిచెను నీమోమధ్యము. ఇంతయేగాక యమూల్య వస్త్రభూషణాద్యలంకారసమేత మాణిక్య కిరీటసముజ్వల వజ్రతాటంక కర్ణయుగళసుశోభిత వైఢూర్య స్థగిత వడ్డాణబంధతనుమధ్య. రత్నకంకణాలంకృత పుష్యరాగాంచి కనకాభరణ నాసికావిభ్రాజమాన వారణాసీ పీతాంబరాచ్ఛాదిత కాశేయకంచుకాభిశోభిత. అదిగో! నొసటియందలి కస్తూరి తిలకము, భ్రూమధ్యమందలి కుంకుమరేఖ. ఆదేవజూడుము, నమస్కరింపుము ప్రార్థింపుము, అభీష్టమును గోరుకొనుము ఆశీర్వదింపుమని వేడుకొనుము వరప్రసాదమును గ్రహింపుమని యడుగుకొనుడు. ఉత్తరదేశమున క్షేమ కాళికేశ్వరి, మధ్యదేశమునకు దేశమాత, దక్షిణదేశమునకు చాముండేశ్వరి, పశ్చిమమునకు మాయాస్వరూపిణి, తూర్పుసీమకు సూరమ్మ, భూదేవులకు లలితాంబిక, రాజచంద్రులకు శక్తిస్వరూపిణి, వైశ్యకోటికి కన్యకాంబిక, శూద్రులకు మర్గమ్మ, బిల్లులకు మారెమ్మ. అదిగో! బిల్లులతిత్వరితముగ నడచుచున్నారు. దేవికినమస్కరించిరి. చాలప్రొద్దున్నందున గాబోలు వెడలిపోయిరి. అంతయేగాదు మరలవారర్థరాత్రమున మేకపోతుల్గొనివచ్చి యామేకు బలిసమర్పించి వారివారి మనోభీష్టముల నెరవేర్పయతిభక్తితో నమస్కరించి స్వగృహంబులకరిగిరి.

ఈనిర్జన ప్రదేశంబున నీదేవి కీభూషణములెట్లు లభించెనని పాఠకులూహింపవచ్చును. ఇది పురాతనమైన యాలయముగాన, వారిపెద్దలనాటినుండి యపహరింపబడిన సొత్తులేయవి. వారపహరించి నప్పుడంతయును దేవికిఁ గానుక లర్పించుట వాడుకగాన నివి మూటికారై నేఁటికివేల కతిశయించినవి.

---

# నాలుగవ ప్రకరణము

---

పూర్వపు విజయనగర రాజ్యములోనివి బల్లారి, కర్నూలు, కడప, అనంతపుర మండలములు. ఇవి విజయనగర సంస్థానాధీశుల వశమందుండి రామరాజు విజయనగరరాజ్యమును గోల్పోయినపుడు, బహమనీ సుల్తానుల పాలనమునకులోనై, గోల్కొండ నవాబు వశమునకు వచ్చెను. నాఁటగోలె పారంపర్యముగా హైదరబాదు నవాబులే వీనిని బాలించుచువచ్చిరి. కొంతకాలమైనతరువాత టిప్పు సుల్తాను వీనిని దనవశము చేసికొనెను గాని, యాతని ప్రతిభ చాలకాల మందు నిలువనందున తిరుగనవి హైదర బాదునకే చేరిపోయెను. నిజామను బిరుదమందినహైదర బాదునబాబు రక్షణార్థమై యాంగ్లరాజులు రక్షకసేనను సెకందరాబాదునం దుంచిరి. ఆరాణువయొక్క

వెచ్చములకై యీనాలుగు జిల్లాలును నైజాము ఆంగ్లేయులకు దత్తము చేసెను. అప్పటినుండి యవి దత్తమండలములని పిలువ బడుచున్నవి. ఈమండలముల కెల్లను నాయకమణి బళ్లారి మండలము. దీనిలోని సుప్రసిద్ధమగు పట్టణమే కమలాపురము. ఈకమలాపురమందలి రమేశునకు హరిదాసుండనెడి కుమారుఁడు గలఁడు. ఇతఁడు కళింగరాజ్యములోనిదైన శ్రీకాకుళము నందలి యొక కళాశాలయం దాంగ్లవిద్యాపఠన మొనర్చుచుండెను. రమేశుఁడు ద్రవ్యవంతుఁడుమాత్రముగాక త్యాగియనియుఁ బేరెన్నికఁగాంచి యుండెను. ఇతని సుగుణములే హరిదాసునందు ప్రతిఫలించుచుండెను "సింగముకడుపున మృగశాబకము జనింపదుకదా."

హరిదాసు ప్రతివత్సరమున నెండకాలపు సెలవులందుఁ దనబంధు మిత్రాదులను జూడ గమలాపురమున కేగుచుండెడి. వాఁడు సెలవులగుట. కానాఁటి వేకువను కుక్కుటములు "కొక్కొరుకో" యని కూయుచుండ తూర్పుదిక్కున 'మినుకు మినుకు'మని వేగుచుక్క ప్రకాశించుచుండ హరిదాసుఁడొక సేవకునితో నెడ్లబండియందుఁ గమలాపుర ప్రయాణము చేయసాగెను. ఇతనివయసు పిరువదేండ్లకు మించదు. వానివిశాల నేత్రములును, తిలపుష్పమున కీడగు నాసికయును నిగనిగమెఱయు కురులును బంగారుమేనిచాయయు నాతఁడందముగలవాఁడని చెప్పకయే చెప్పుచున్నవి. అతఁడు వానిమేనున కెనయగునట్లు మోకాలివఱకు వ్రేలాడు తెల్లని "యంగరఖాఁ" దొడిగికొని

యుండెను. శిరమున ధరించిన పసిడిపట్టుచమ్మా యాతని మూపుపై నెమలి పించమువలె వ్రేలాడుచుండెను. వారీలాగు ప్రయాణముసేయుచు మట్టమధ్యాహ్నమున నొక యరణ్యమును బ్రవేశించిరి. అయ్యది దట్టముగా వల్లుకొనిన తీగలచేతను వృక్షవాటికలచేతను నిండినదగుటచే మట్టమధ్యాహ్నమైనను సూర్యుని తీక్ష్ణమైనకిరణములు లోనికి జొరవీలులేకుండెను. ఏచాయ వీక్షించినను జూపఱకు భీతికలుగఁ జేయు వల్మీకములు తాళవృంతములవలెఁ బెరిగియుండెను. ఏవైపు జూచినను ముండ్లతుప్పలు గ్రిక్కిరిసి క్రూరమృగ భీకరధ్వనులకాకరమై యుండెను. మనబాటసారులు సూర్యాతపమునకు దాళఁజాలక యా యరణ్యమునందొక పెద్ద వటవృక్షము క్రింద విడిసిరి. సేవకుఁడు పచనాదికృత్యములు దీర్చ హరిదాసుభుజించి, యచ్చటనే సేవకునిచే నమర్పఁబడిన శయ్యపై బరుండి, యాయాసపు బడలికల నడఁచుకొనుచుండెను.

అత్తరుణమున నెచ్చటనుండియో యొక స్త్రీరోదన మాతని కర్ణపుటంబులఁ దటాలునఁ బడెను. అతఁడదరిపడి లేచి కూర్చుండి యారోదనమునిక్కమో కాదోయని మొదట సంశయించెనుగాని యా సందేహ మెంతోసేపాతని హృదయమున నిలువలేదు. అతిజాగరూకతతో నతడాధ్వని విని యది యేప్రక్కనుండి వచ్చుచుండెనో యాదిశకు ఖడ్గపాణియై పరువిడసాగెను.

ఇట్లాతఁడు నెమకుచుఁ బోవుచుండనొక పెద్దవృక్ష ముక్రింద నలుగు రాటవికులు పదునాలుగేండ్ల వయస్సుగల యొక బాలికను కాలుసేతులుబంధించుచుండుటగాంచెను. "ఓరీ దురాత్ములారా! బాలికను జెఱగొందురా! తాళుఁడుతాళుఁడు, ఇదే!వచ్చితి" నని కేకలిడుచునతడువారిని సమీపించెను. వారాతని గాంచి తలకొక దిక్కునకు బాఱిపోయిరి. అప్పుడా బాలికకును హరిదాసునకును నీగిక్రింది సంభాషణము జరిగెను.

బా—(భయంబున వడకుచు)అయ్యా మీరునన్నీమహోపద్రవమునుండి తప్పించి ప్రాణదాన మొసగినమహానుభావులు. మీరెవరు?

హ—అమ్మా నేను శ్రీకాకుళము నందలి యొకకళాశాల విద్యార్థిని. వేసవి సెలవులయినందున బంధువర్గమును జూచుటకై కమలాపురమున కేగుచున్నాను. అమ్మా నీతల్లిదండ్రు లెవరు? నీపేరేమి?

బా—తండ్రి సోమనాథుడు, తల్లి సుశీల.
హ—నీ యూరెయ్యది?
బా—విజయనగరము.
హ—తండ్రి యుద్యోగము?
బా—రక్షకభటవర్గమునందున్నతోద్యోగము.
హ—నీవిచట కెట్లువచ్చితివి?
బా—మాతండ్రి యింటలేమింజూచి యర్ధరాత్రంబున

గాఢనిద్రాపరవశనైయుండిన నన్నాకస్మికముగా నీయాటవికు లిటుదెచ్చిరి.

హ—వీండ్రెవరు?

బా—ఈయడవియందుం గ్రుమ్మరు భిల్లులు.

హ—అమ్మ! భిల్లులని పేర్కొంటివే? వారునీకుం దెలిసినవారా?

బా—వారు నూతండ్రి నెఱింగియున్నట్లు వారిసంభాషణములు సూచించుచున్నవి.

హ—నిన్నుం దెచ్చుటవలన వారికేమిలాభము?

బా—వారిదుండగముల నివారింపమాతండ్రి యెన్నియో ప్రయత్నములం జేయుచున్నాండు' అందువలనవారు చౌర్యార్థమరుగ వీలులేకున్నది. అందుచేత మానాయనమీందం బగసాధింపనెంచి కాళికాదేవికి నన్ను బలిగా నర్పింపవలెనని యు, వారనుకొనుచుండిరి.

హ—(స్వగతము) ఈకన్యంజూడంజాల సౌందర్యవతిగానున్నది. అహా! ఏమి! సువర్ణకాంతిని హసించు నీమేనిసౌందర్యము, కలువలనుగేరు నీవాలుగన్నుల యందము, తామరతూండుల కెనయగు నీమృదుపాణుల మార్దవము, బిలమును హసించు నీసుందరాస్యము, నేనిదివఱకుం గాంచినకన్యలలో నీమె నామనము నాకర్షించినది. ఈవరవర్ణిని విడుంవజాలను. ఇట్లని

మనంబున దలఁచుచు "అమ్మా! నిర్భయంబుగ నీగృహముఁ జేర్చెదను. నావెంటవచ్చుట కేమేని సందేహమా?"

బా—ఈదుర్గమారణ్యమున నాత్మరక్షకులగు మీకన్న నాకింకెవరుదిక్కు?

హ—అట్లయిన నావెంటరమ్మా.

వారిట్లు దారినడచుచుండిరి. కొంతదూరమరిగిన పిదపఁ గొందఱుమనుష్యులు వీరికి గోచరమయిరి. ఆబాలిక వారిని గనుఁగొని "అల్లదిగో! మాతండ్రిసేవకు లిటువచ్చుచున్నారు."

హ—వారిని నీవు గుర్తించితివా?

బా—చిన్ననాఁటనుండియు నన్నెత్తియాడించిన వారలను నేనెఱుఁగనా?

హ—నే నవసరముగాఁ బోవలసినపనియున్నది. వీరిరాక నాకెంతయో యానందముఁ గలుగఁజేయుచున్నది. వీరు రాని యెడ నాపనికభ్యంతరము గలిగియుండును.

సేవకులు—అల్లదే మనయమ్మాయి! మనపుణ్యవశమున మనకు దొరకినది. మన శ్రమయంతయుఁ దీఱిపోయినది.

హ—మీరెవరు?

సే—మే మీబాలిక నారయుటకై మాయజమానుఁడగు సోమనాథునిచేఁ బంపఁబడితిమి. ఈమె యాతనికూఁతురగు

లలిత. వెదుకఁబోయిన తీఁగె కాళ్లఁదగిలినట్లు మీరే మాకెదురైతిరి.

హ—(ఆమెవైపుజూచుచు) వీరివెంటఁబోవ నీకేమైన సంశయమా?

ల—ఒక్కటిమాత్రము.

హ—ఏది ?

ల—"మిమ్మోడఁబాయఁ గలిగినది" అని యాబాలిక సంకోచవదనయై వినయపూర్వకముగా విన్నవించుకొనెను. అదేలోకోకాని హరిదాసుని మోముదమ్మి వికసించెను. ఒక్కసారి యాతఁడా బాలిక మోమునుజూచెను. ఆమె యవనతవదనయై కాలిబొటన వ్రేలిచే నేలరాయుచుండెను. హరిదాసుఁడామెతో నిట్లనెను. "ఏను నీవెంటవచ్చుటయే నీకోర్కెయా?"

బా—నాకోర్కె దీర్చుట కిష్టమైనచో సేధన్యనే.

హ—సేవకులు రానిచో నది నాకు విధ్యనిధర్మమై యుండెను. ఇప్పుడు నామానసము స్వస్థపడి స్వవిషయములకై కనులాపురను నకేగ ప్రాకులాడుచున్నది. కాన నాయెడఁబాటు నించుక సైరింపుము.

జహ్నవి వాలారుఁజూపులు హరిదాసునిపైఁ బ్రసరింపఁ జొచ్చెను. ఆమె వదనమండలము మందహాసచంద్రికలచేఁ జిందులుద్రొక్కుచుండెను. తదేకధ్యానమున హరిదాసు నిర్విణ్ణుఁడయ్యెను ఇరువురిజూపు లేకీభవించినవి. ఆచూపులందుఁ బ్రే

మైకరస మట్టిపడుచుండెనని చెప్పుట యతిశయోక్తికాదు. మరల నాబాలిక యిట్లనెను. "ప్రాణభిక్ష నిడితిరిగాన నాస్వగృమునకేతెంచి, జననీజనకుల యాశీర్వాదమును మదీయాతిథ్యమును బొందుదురని నమ్మియుంటిని."

హా—సేవకులు నాకైయీయరణ్యమున వేచియున్నారు. ఇప్పుడు నేనేతెంచిన నాపనికభ్యంతరము గలుగును. మఱియొక సారి వచ్చెదను.

కరుణాకటాక్షముల నామెనుజూచుచుఁ దొలుత నే నేను నీనామమును వినగోరితిని. దానినీవు చెప్పవైతివి. ఇప్పుడైనఁ జెప్పి నన్నుఁ గృతార్థునిఁ గావింపుము.

బా—నాపేరు లలిత.

హా—ఏలలిత?

బా—సోమనాథుని తనయ.

లలితా! నీవు సోమనాథుని తనయవా? తత్క్షణమే హరిదాసుమన సవశమైపోయెను. రక్తనాళములం దుష్ణముప్పొంగఁ జొచ్చెను. ఇట్టిదని నిర్దేశింపరాని యొక భావోద్రేకముచే నాతనినోట మాటరాక నాలుక తడఁబడఁజొచ్చెను. గద్గద కంఠముతో "నీవు నామేనమామతనయవగు లలితవా" అనెను.

బా—మీరెవరు?

హా—నేను మీతండ్రి సోదరికుమారుఁడ. హరిదాసుఁడ. నీ యయిదేండ్ల ప్రాయమునాఁడు నిన్నుఁ గాంచియుండుటచే నానవాలు పట్టఁజాలకపోతిని.

చిరకాలసమాగమమున కానంద పరవశులై యున్న యాయిరువురు చిత్రింపబడిన ప్రతిమలవలె నట్టే నిలువబడి పోయిరి. ఆనందముచే దన్మయులైయున్న యాయువతీయువకులఁగాంచుచు నాసేవకులును నానందాంబుధి మునిఁగియుండిరి. కొంతసేపటికి హరిదాసు "లలితా! నే బోయివచ్చెద సెలవిమ్ము" అనెను.



లలిత—మరల మీదర్శన మెప్పుడు?

హ—లలితా! నేఁదప్పక తిరుగవచ్చెదను.

ఇట్లు చెప్పుచు నతఁడామెహస్తమునందేదియో యుంచి యాచేతిని గప్పిపట్టెను. లలిత కలవరపడి పిడికిలిని విడిపించుకొని హస్తమందలి యానవాలుఁగాంచి లజ్జావనతవదన యయ్యెను. ఆయువతీయువకుల యత్యంతమైత్రిఁ గాంచి సేవకులానందించిరి. ఆమె ముఖసరోజమును కన్నులారఁగాంచి "చాల ప్రొద్దయ్యె పోం"డని చెప్పి హరిదాసు తనదారిని బోయెను.

మహాశయులారా! నాఁడు విశాలసమతలమందు వినోదగోష్ఠినుండ సర్పదష్టయైన నాబాలిక యే యీలలిత. ఔషధపటుత్వముచే నానాఁటికి సురక్షితయై, నేఁడీయాటవికులచేఁబడి కడగండ్లఁగుడిచెఁగాని, హరిదాసుచే రక్షితయై యీమెయిప్పుడు సేవకుల కర్పింపఁబడి, స్వగృహముఁ జేర్పబడినది.

---

ఐదవ ప్రకరణము.

# అయిదవ ప్రకరణము

ప్రకృతిచిత్రము అవాఙ్మానసగోచరమైనది. దాని యంతము దెలిసినవారు లోకమం దరుదుగ నుందురు. అధ్యాత్ముల కీమాయ గోచరించినను వారు దీనిని తృణీకరింతురు. ఇఁక లోకమున కీకీలు తెలియుటెట్లు? పరాత్పరుఁ డందమా యతఁ డంతర్యామి, ఆది మధ్యాంతరహితుఁడు. అయిన నఘటనాఘటనసమర్థుఁడు, భక్తజనమందారుఁడు. దీనులపాలి కామధేనువు, తన్నుఁ దలచినవారి చేతిబిడ్డ. అయిననేమి? లోకమొకవంక దుఃఖించుచున్నది. వేఱొకవంక వ్యాధిబాధితమైయున్నది. మఱియొకచాయ కాటకముచేఁ బీడింపఁబడుచున్నది. ఒండొకదిక్కున వర్షాభావముచేఁ బరితపించుచున్నది. వేఱొకవంక సస్యసమృద్ధిచే సంతసించుచున్నది. జలసమృద్ధియై యానందించుచున్నది. ఒకచోటనవ్వు, ఇంకొకచోటనేడుపు. ఈకీలు నాటకసూత్రధారికిఁగాక మఱెవ్వరి కెఱుక?

లలిత యిపుడెట్లున్నది? తల్లిదండ్రులయెడఁ దన ముఱిపెంపు ముచ్చటలఁ జూపుచున్నది. తన కడగండ్లు గడచినవని యానందించుచున్నది. హరిదాసపుడపు డామె యాంతరంగిక ప్రేమకుఁ గుఱియగుచుండెను. కొంతకాలమామె తన జీవితమును సుఖముగాఁ గడపుచుండెను. కాని కాలచక్రమేకరీతినుండెడిదికాదు. ఒక్కొక్కమాఱది తారుమాఱగుచుండును. నిన్నటి

సంతోషము నేఁడుండదు. లలిత తనమందిర మధ్యమున నొక చిఱుచాపపైఁ గూరుచుండియుండెను. ఆమె యొక చేతి వస్త్రము నతిమనోహరముగాఁ గుట్టుచుండెను. ఇంతలోఁ దల్లి యామెను సమీపించెను. సుశీల సోమనాథునికి ధర్మపత్ని యైయుండెను. ఈమె తననామమునకుఁ దగిన గుణమును, గుణమున కీడగు రూపు రేఖలావణ్యములను గలిగియుండెను. తనభర్త దార్జన్యములకై యెల్ల వేళలలో లోనఁ గుందుచున్నట్లుండెను. లలితాసుశీలల కిట్లు సంభాషణమారంభమయ్యెను.

సు—లలితా! యేమిచేయుచున్నావు?

ల—అమ్మా! చేతిగుడ్డనల్లుచున్నాను.

సు—ముగసినదా?

ల—పుష్పములల్లుటతో మూఁడుమూలలు ముగిసినవిగాని నాల్గవమూలమాత్ర మటులనేయున్నది.

సు—ఇఁక దేనితో దాని నలంకరించెదవు?

ల—లతలతోడను పుష్పములతోడను చుట్టియుండునటుల నా నామాక్షరములఁ గుట్టెద.

సు—లలితా! ఇది యిప్పుడే యింత యందముగాఁగాన్పించుచున్నది? ముగిసిన నింకెంత మనోహరముగానుండునో? ఎవరికొఱకు దీనినిట్లల్లుచున్నావు?

లలిత నిరుత్తరయయ్యెను.

సు—ఏమి ఊరకుంటివి?

వీరిట్లు సంభాషించుచుండ నంతలోఁ దపాలవాఁడొక లేఖనిచ్చి లలిత చేతి వ్రాలుఁగొని వెడలిపోయెను.

అయ్యది యాంగ్లేయ భాషయందు లిఖింపబడియుండెను. వా రాంగ్లేయభాష నభ్యసించినవారుకానందునను నప్పుడాంగ్లేయభాష నేర్చిన స్త్రీలరుదగుటవలనను లేఖావిషయ మరయుటకై వారు సోమనాథునిరాక కెదురుచూచుచుండిరి.

యథాప్రకారము సోమనాథుఁడు గృహమునకేతెంచెను. లలిత యాలేఖను తండ్రికందించెను. అతిత్వరితముగా సోమనాథుఁడా లేఖనువిప్పిచూచుచుండెను. అది యొకతంతివార్తయైయుండెను. తత్క్షణమే యాతనిసర్వాంగకములును కంపించిపోయెను. ముఖము వివర్ణత నొందెను. దేహము వడకసాగెను. శరీరమంతయు ఘర్మజలముచేఁ దడుపఁబడెను, కన్నులశ్రుపూరితము లయ్యెను. కాని కమ్మవిషయము మాత్ర మాతనినోట నుండి వెలువడలేదు. ఉత్తరమునందలి విషయము లాలకింప సుశీలాలలిత లాతురలైయుండిరి. సోమనాథుని స్థితిగతులఁగాంచి వారతిభీతికిలోనైరి. లలితయించుక ధైర్యముదెచ్చుకొని నాయనా! ఈలేఖయందలి విశేషములేమి? మోమెల్ల వ్యసనగ్రస్తమైకన్పట్టెడి. విషయమును విన మే మాతురులమై యుంటిమి. కాన శీఘ్రమానతిమ్మని యామె త్వరపెట్టసాగెను. సోమనాథుఁడు "అయ్యోపుత్రికా! హైమవతీ!" యని క్రిందఁబడెను.

"నాథా! యింకేమున్నది? హైమవతి సౌఖ్యమున కంతరాయమా?"

సోమనాథుఁ డించుక కంఠమును సవరించుకొని "మన జ్యేష్ఠపుత్రిక స్వర్గస్థురాలయ్యె" నని డగ్గుత్తికతోఁ బల్కెను.

పిడుగుఁబోలిన యామాట ముగియకమున్నె యా యిరువురును హా యనియఱచి క్రిందఁబడి మూర్ఛిల్లిరి. ఆ కేకవిని పరిచారిక యాత్రముగలదై యాగదియందుఁ బ్రవేశించి మూర్ఛిల్లినవారినిగాంచెను. తత్క్షణమే యామె భయకంపితయై సుశీలకు శైత్యోపచారము లొనర్ప సాగెను.

"హైమవతీ! మమ్ము దుఃఖసముద్రములోనుంచిపోయితివా? నీజనని కేమిచెప్పితివి? అత్తగారింటికిఁబోయి యాఱు నెలలైననుగాలేదే! అయ్యో! బిడ్డా! యింక నీముఖారవిందమెందుఁగాంచఁగలను? ఈదుస్సహమైన శోకమెట్లుభరింతును? అకటా హైమవతీ! నిన్ను వీడినేనెట్లుమనఁగలను? అరవిందాయతనేత్రవే! కెందమ్మిగేరు హస్తములదానవే! సుగుణముల ప్రోవవే! నీసౌందర్యమునంతను మంటఁగలిపితివా? అయ్యో! పుత్రికా! నావంటి నిర్భాగ్యురాలికి నీవంటి పుత్రీ రత్నము దక్కునా? నేనెంత భాగ్యహీనను! హా దైవమా! త్రిజగంబుల భరించునీకు నాపుత్రికయొక్కతె మాత్రమే భారంబుగాఁదోఁచెనా? తల్లీ! అసహాయనై నేనిట్లు పరితపించుట నీవెఱుఁగవు

గదా? ఎటింగిన నెంతవంతనొందుదువో! నన్నిలాగు మోసముజేయుదువని కలనైనం దలంపనైతినే" అని సుశీల మరల మూర్ఛిల్లెను.

పాపము! పరిచారిక యొనర్చిన శైత్యోపచారముల వలన లలిత మేల్కాంచినది. సోదరీ! నీవంటియక్కను గలిగియుండు భాగ్యము నాకు లేదయ్యెనేయని వాపోవుచు లోలోనం గుందుచున్నది.

శైత్యోపచారములవలన సుశీల మరల దెలివిగాంచెను ఆమె మరలమరల గోడుగోడున నేడువఁజొచ్చెను. ఇంతలో సోమనాథుం డించుక హృదయమునకు విశ్రాంతి గలిగించుకొని "సుశీలా! ధైర్యముతో నుండుము. గతించినసుత మన మెంత యేడ్చినను రాఁజాలదు. ఆబిడ్డ కాయువంతయే దైవ మొసంగెను. ఇచ్చినవాఁడు తానె తీసికొన్నవాఁడును దానె. ఋణానుబంధంబులు బుద్బుదప్రాయంబులు. దేహమను నామంబుతోం బరగుచు' రుధిర పలలాదులచే నంటగట్టబడిన యీశరీరము లశాశ్వతంబులని నీకుం దెలియదా? అశాశ్వతమైన దేహమునువీడిం శాశ్వతసుఖమునకై మోక్షమునకేగిన పుత్రికకు నగచుట న్యాయమగునే? శోకింపకుము. నీకోమల దేహమును శుష్కింపఁజేయకు" మనియామె నెన్నియో విధముల నూరడింపఁజూచెను.

సుశీలహృదయతాపాగ్ని మాటలచేఁ జల్లారునది కాదు. ఆదుఃఖవీచికలు నఖశిఖపర్యంతమావరించి నిముషనిముషమునకు పైపైబుకుచుండుటచే నామెనాఁడునాఁటికి శుష్కించి శుష్కించి, దారుణజ్వరపీడిత యయ్యెను. అతఁడామె కాయుర్వేద

వైద్యులచేతను, యూనాని వైద్యులచేతను చికిత్సలు చేయించు చుండెను, కానియవి బూదింజేసిన హోమంబు భంగి వ్యర్థమే యగుచుండెను. రోగము దినదినాభివృద్ధిం జెందెను. సుశీల పూర్తిగాఁ బరుపంటిపోయెను. సోమనాథుఁడు తన పుత్రికా పుత్రులతో రేయింబవళ్ళు శయ్యా పార్శ్వముననుండి యుపచారములు సలుపుచుండెను.

ఆమె సర్వజనసహకారి కావున నామె నెఱిగిన వారందఱు వ్యాకులచిత్తులై పలుమాఱు చూచుటకు వచ్చుచుఁ బోవుచునుండిరి. దినములు జరుగుకొలఁది రోగ మధిక మగుచునే యుండెను. సోమనాథుఁ డామె సెజ్జప్రక్కనుఁ గూరుచుండి తానామెకు సల్పిన స్వయంకృతాపరాధముల వలనఁ గలిగిన శోకముచే హృదయము పరితపించుచుండ లోలోనఁ గుందిగిపోవుచుండెను. ఆమె యప్పుడప్పు డాతనిపై దీన చూపులఁ బ్రసరింపఁ జేయుచుండెను. కాని యతఁ డాచూపు లయందలి భావమును గ్రహింపలేకుండెను. లలిత తన యన్న గారింజేరి విషాదముచే సుక్కుచుండెను. కనుగవల నుండి ముమ్మరముగా స్రవించు నశ్రుపు లాణిముత్తెపుసరులఁ బోలి యామె మృదుగండపార్శ్వములనుండి జారుచుండ మాటిమాటికిఁ బైటచెఱఁగుచేఁ వానిఁ దుడుచుకొనుచుం డెను. తల్లికి జ్వరమధికముగా నుండుటచేఁ దండ్రితో లలిత "అప్పా! మఱొక వైద్యునిచే మాతకుఁ జికిత్స చేయింపరాదా" అనెను.

సో—అమ్మా! నేను నల్లే యూహించి వేఱొక వైద్యునిం దోడితెచ్చుటకు సేవకునంపితిని. ఆతనిరాకకై వేచియు యున్నాను.

ల—తండ్రీ! ప్రేమనకు ప్రేమమైన సోదరి మరణించెను. సదా ప్రియకారిణియు, సుఖస్వరూపిణియు, నానందదాయినియు నగు మాతృదేవి శయ్యపైనుండ మున్ముంగా పాడువారెవరు! ఆదరించువారెవరు! భరించువారెవరు!

సో—(హీనస్వరముతో) అమ్మా! కడచినదానికై వగవకుము. మీతల్లి త్వరలో నారోగ్యము వడయఁగలదు.

ఇంతలో పరిచారిక వైద్యునిరాక నెఱింగించెను. సోమనాథుఁడు వారి రాకంగాంచి లేచి, వైద్యుని సమీపించి యాతని హస్తములఁ బట్టుకొని, అయ్యా! వయసున నెన్నియో యేండ్లు చిన్నవాడవయ్యు బుద్ధియందుఁ బెద్దవు. అందుచే నిన్ను వేడుకొన్నఁ దప్పులేదు. నాపత్నికిఁ బ్రాణదానంబొసంగి యీ నాకుటుంబమును గట్టెక్కింపుఁడు.

ఆతని ప్రార్థనమును విన్నతోడనే వైద్యుని మనసు కరుఁగ "అయ్యా! నేను కించిజ్ఞుఁడ నన్నింత వేఁడుకొనవలదు, నాకర్తవ్యకార్య మెఱింగింపుము. తప్పక నాయోపిన యుపకారంబు సేయుదు" నని పలికెను. అందులకు సోమనాథుఁడు తీవ్రజ్వరమామెను బీడించుచున్నదనియు, దాహమునకు మితియు, మేరయు లేవనియు, రేయుంబవళ్ళుఁ గనుకన్నమాటయే లేదనియుఁ జెప్పెను. వైద్యుఁడు వాడి పరీక్షింప వలయునని

శయ్యను సమీపింప లలిత "అమ్మా! నీకొఱకుఁ గొత్తవై ద్యులు వచ్చియున్నారు. కన్నులువిచ్చి యొక్కసారిచూడు" మని యామెను చేతితో తట్టెను. అందుకు సుశీల "నాకు రోగము లేదు. నన్నుఁబోనిండు నేనిచ్చట నుండ" నని సన్నిపాత వశమున లేవంబోయెను. చెంతనున్నవా రామె నూరడించి పరుండఁబెట్టిరి. వైద్యుడామె చేయిఁబట్టుకొని నాడి పరీక్షించి కొన్ని ప్రశ్నలడిగి స్థితి చక్కగాఁ గనిపెట్టి, యౌషధము పంపెదనని చెప్పి విడిదికిం జనియె.

సాయంకాల మూఁడుగంటలకు సుశీల యతికష్టముతో భర్త వంకను, గుమారులవంకను జూచెను. ఆచూపులు క్రమముగా లలితవంకఁ దిరిగెను. అదియే కడసారి చూపులని తలఁచి లలిత "అమ్మా!" యని యొక్కకేక వైచి యామె ముఖముపైఁ బడెను. అందఱును రోగిచుట్టు మూఁగియుండిరి. తోడనే యామె కన్నులు మూఁతపడెను. ఒక్క నిట్టూర్పుతోఁ బ్రాణ వాయువు లెగసిపోయెను. అప్పుడాగృహమంతయు రోదన ధ్వనులతో నిండెను. నాఁటనుండియు సోమనాథుఁడు దారా వియోగదుఃఖము నాపఁజాలక యధికమధువును సేవింప మొదలిడెను. అల్పకాలముననే తనదుఃఖమును మఱచి సోమనాథుఁడు మధుపాన మిత్రులతోఁ గాలము పుచ్చసాగెను. సుశీల తన మానసమునఁ దట్టినపుడెల్ల నెక్కువగా గంజాయిత్రావి, నంజుళ్లమెక్కి, యాతఁడాశోకము నడఁచుచుండెడివాఁడు.

త్రాగుబోతుల నడవళ్లు శోచనీయములు. అతఁడొక్కొక మారు మధువును గ్రోలుచు దానిమూలమున జనించిన మైక

ముచే దూఁగుచుండును. చిరపరిచయులగు మధుపానమిత్రు లంగాంచినఁ దూలుచు వారివెంట బికారివోలెఁ దిరుగుచుం డును. మితిమించినమత్తుచేఁ గ్రిందపడి పొరలుచుండును. దుర్భా షలనాడుచుండును. పోరాటమున కుంకించుచుండును' లజ్జలేక తిరుగుచుండును. అతిహేయములగు విషయములంజిక్కి యొక్కొ కతఱి వెఱ్ఱివానివోలె వెడలుచుండును. వెఱ్ఱివేయివిధములన్న ట్లాతఁడిట్లున్మత్తుఁడగుటచే చెడునడతలకడలి రక్షకభటవర్గము నుండి పరిభవ్వమువారీతనిఁ దొలఁగించిరి.

ఇపుడు సోమనాథునిపిచ్చి పెచ్చుపెరిగి నితఁడువీధివీధులం దిరుగజొచ్చెను. చూచినవారిపై నెల్లను బాషాణములఁబ్రయో గింపసాగెను. చిరపరిచితులగువారుతన్నుఁ బ్రేమింపఁ జొచ్చి న పలుమాఱు వారిని దిట్టుచుండెను. ఇట్లుందటికనిష్టుఁడై స్వ కుటుంబమునకుదూరుఁడై పుత్రులనెన్నక లలితయందలి ప్రీతిని బోలి, హేయగుణపూరితుఁడై, తుదకాతఁడు దేశముల వెంబడి దిరుగఁజొచ్చెను.

అహా! మధుపానము కుటుంబముల కెట్టియరిష్టమును దెచ్చునదో చూడుఁడు.

---

# ఆఱవ ప్రకరణము

---

విజయనగరమునందు ధనగుప్తుఁడను భూస్వామికి వసం తుఁడను తనయుఁడుకలఁడు. ధనగుప్తుఁడాపురమునందుగలధనికుల

లో ప్రసిద్ధిఁజెందినవాఁడు. ఇతఁడింతటి యైశ్వర్యవంతుఁడైనందునఁ గుమారుఁడు సలుపువెచ్చము లాతనికి గోచరింపవయ్యె. వసంతుఁడెల్లప్పుడు నాటకగాండ్రతోడను, పాటగాండ్రతోడను, హాస్యగాండ్రతోడను, కాలక్షేపము సేయుచుండెను. ఈదుష్టునికి తండ్రి యెన్నియోమాఱులు బుద్ధిచెప్పెనుగాని వసంతుఁడు స్వబుద్ధిఁ వీడఁడయ్యెను. అతఁడొకనాఁడు భోజనాది కృత్యములఁ దీర్చుకొని తనభవనమునందలి ముందఱిచావడి యందొక సోఫాపైఁగూరుచుండి చుట్టగాల్చుచు ధూమమును విడుచుచుండెను. ఇతఁడుముప్పదియేండ్ల వయసుఁగలిగితనదేహమునకుఁగాంతినిచ్చునటుల విలువగలసన్నని తెల్లవస్త్రములను ధరించియుండెను. అమూల్యరత్నఖచితమగు సువర్ణాంగుళీయకమాతనికుడి చేతిచిటికెనవ్రేలిపైఁ బ్రకాశించుచుండెను. చిత్రపుఁబనిచే మెఱయు బంగరుకడియము లాతనిముంజేతుల హత్తియుండెను.

ఆవిలాసవంతునిఁ జూడ నిరువురు యువకు లరుదెంచిరి. వసంతుఁడు వారిని సమధిక గౌరవంబుల సత్కరించి యుచితాసనంబుల నాసీనులంగావించెను. తదనంతరము వారిట్లు మాటాడిరి.

వసం—జయంతా! నేఁడేల యింతయాలస్యము?

జయ—రాజమహేంద్రవరమునుండి కుటుంబసమేతుఁడై వామనుఁ డరుదెంచుటచే నే నియ్యెడ కరుదెంచుట కింత తడవయ్యె.

వస — వామనా! ఆగ్రామమందలి మనమిత్రులకు క్షేమమా?

వా — నే నెఱింగినంతమట్టు కందఱకు క్షేమమే.

జ — మిత్రమా! ఇంక నీకోర్కె యీడేరునని తలంచెద.

వస — ఏమికోరిక?

జ — అది మీలలితయందలి వ్యామోహము.

వ — ఆమె యిపుడెచటనున్నది?

జ — తన యేకాంథసౌధమునం గూరుచుండియుండ వాతాయనపు సందులగుండం గాంచితిని.

వ — ఇపుడొంటిగ వసియించుచున్నదా?

జ — ఔను.

వ — ఇదితరుణముకదా?

జ — ఏమిచేయుమనెదవు?

వ — నా విషయమామెకెఱింగింపవేఁడెద.

జ — అయిన నిపుడేపోయి యామెను దర్శింతునా?

వ — జయంతా! నీవట్లుఁగావించిన నీకు నేనెంతయో కృతజ్ఞుఁడనైయుండెద.

జయంతుడు తనమిత్రునిపనియందాసక్తుఁడై వెడలిపోయెను

వసంతుఁడును వామనుఁడును చీట్లాడ నారంభించిరి. ఒకగడియ ప్రొద్దైన పిమ్మట జయంతుఁడు తిరుగ వచ్చెను. విఫలవార్త నెరింగించెను.

## ఏడఁవ ప్రకరణము

"అన్నా! రాజవాహనా! దూరమును సరకుఁగొనక కడునిడుమల నడలి ప్రయాణమును సాఁగించితిమిగదా! సమీపమందలి పట్టణమున కాహారపానీయముల కొకింత దారి చూచినఁగాని నాప్రాణములు నిలుచునట్లు లేవు." అని రత్నాకరుఁడనెను. "తమ్ముఁడా! దైవము మనలను పరీక్షించుచున్నాఁడు. అట్లుగాకేని యమితైశ్వర్యమునను నతిగౌరవమునను బెఱిగిన మన కుటుంబమునకు నేటికి తినుటకొక కబళమును త్రాఁగుటకొక గ్రుక్కెఁడు నీరును దొరకనికాల మాసన్నమగునని కలనైనను దలఁచియుంటిమా? నేఁటికిట్లయినది. ఇది పురాకృతము. దీని ననుభవింప మనకుఁ దప్పినదికాదు. కొంచమోర్చుకొనుము. నేనీపురమునకరిగి, యాచనావృత్తి ననుసరించి యొగిర మొసఁగి నీక్షుద్బాధ నివారించెద" నని రాజవాహనుఁడనెను. "అన్నా! నీవట్లొంటరిగ నరిగినఁ దిరుగ నన్నుఁ గలిసికొనఁగలుగుదువో లేదో, ఆపురమందలి వీథులెట్లున్నవో యెవరికెఱుక? మనల నెఱిఁగినవారొక్కరేని యిందుఁ గానిపింపరైరి. ఇఁక నీవును నన్నుఁ గనుఁగొనకున్న నాబ్రతుకు దుఃఖభాజనమగును. కావున నిన్నెడఁబాయఁజాలకున్నాఁడ. నేనెన్ని యిడుమలకైనను సైరింతుగాని నిన్ను

మాత్ర మెడఁబాయఁజాల” నని రత్నాకరుఁడనెను. “అట్లయిన జోవృదము రమ్మ” నియాతని హస్తమును బట్టుకొని రాజవాహనుఁడు నడవసాగెను.

వారు పోయినవేళ యెట్టిదో! ఎవ్వరింటికిఁ జనినను నొక కబలమైనను లభింపలేదు. ఎచ్చటకేగిన నచ్చట ,,లేదు పొ”మ్మనువారును ,నీకొఱ కెవ్వరాయత్తము చేసియుంచినా”రనువారును, ,,ఛీ! అఱవకు పొ”మ్మనువారును, కొట్టుటకు పైఁబడ వచ్చువారును, తిట్టువారును, చీవాట్లుపెట్టువారును గలరేకాని పట్టెడన్నమును గ్రుక్కెఁడునీటిని నిచ్చి యాదరించినవారు లేరైరి.

,,అన్నా! ఇది యేమియాఁకలియోకాని కడుపులో నున్న ప్రేగులను మాడ్చివేయుచున్నది. ఈపసితనమునకుఁ దోడై యాకఁలియు, నాఁకలికిఁ దోడై బడలికయు, మనలఁ బెట్టు తిప్పలఁ జెప్పుకొందమన్న నాలకించువారెవరు? తల్లియున్న మనకీతిప్పలు వచ్చియుండవుగదా! ఆతల్లిని దిగమ్రింగి సంపూర్ణాయువుతోఁ బ్రజలఁ బీడించుచు దినమంతయుఁ బట్టెఁడోగిరముకొఱకుఁ బంచపంచల దిరుగుచు, హేయ జీవనమును గడపెడి మనదేటిబ్రతుకు? భగవంతుఁడా! మానిమిత్తమింకెన్ని దుఃఖముల నిలువజేసియున్నావో, యన్నిటి నొక్కసారిగఁ బంపి మమ్మునీకడకుఁ గొంపోవరాదా?” యని దీనముగా రత్నాకరుఁడు వాపోవుచుండెను.

,,రత్నాకరా! నాయాఁకలికన్నను, ప్రయాణపు బడలికకన్నను నీదీనాలాపములు నన్నెంతయో క్రుంగఁజేయుచు

న్నవి. మనలఁ జూచి జాలిపడుటకు మారుగా వెడలనంపుడని సేవకుల కానతిచ్చువారిండ్ల హృదయములు కఠోర లోహసదృశములు కావా? అదిగో! క్రొత్తగా సున్నముతో నలఁదిన యా మేడం గాంచుము. అది యెంత యందముగాఁ గన్పట్టుచున్నదో! ఇంతటి యైశ్వర్యములతో విలసిల్లు నీనగరమందు మనయవస్థలఁ గాంచి జాలిపడువా రొక్కఁ రేని యుండరా? అచ్చటికిఁబోద మురా"మ్మని వారిద్ద ఱాగృహము చెంతకుఁ బోయిరి.

ఆ చావడియందొక వృద్ధుఁడు సోఫాపైఁ గూరుచుండి యాంగ్లేయపత్రికలఁ జదువుచుండెను. అతనినిఁ గాంచి, "స్వామీ! ఆకలి మెండుగానున్నది. దాహమేగాక శోషకూడఁ బాడమనున్నది. మా కాహార పానీయముల కేదైనఁ ద్రోవ చూపి పుణ్యముఁ గట్టుకొనుఁ"డని వీరు ప్రతిమాలిరి. ఆవృద్ధుఁడు పిల్లపాపలఁగన్నవాఁడగుటచే వారి వేఁడికోలువలన నాతనికిఁ జాలివొడమినది. అతఁడిట్లు ప్రసంగించెను.

వృ—మీకాప్తులేరేనిఁ గలరా?

భి—భిక్షుకుల కాప్తులెవరు? ఇంచుక చేరఁదీసి పిడికెఁడన్నమును బెట్టినవారే తల్లిదండ్రులు.

వృ—మీమాటలసరణిఁ జూడ, మీరు భిక్షుకులవలెఁ గాన్పింపరు. మీకథయేమి?

భి—మాకథతోఁ బ్రయోజనమేమి? కడుపు మండిపోవు. చున్నది. క్షుద్బాధఁదీర్చు పుణ్యమునఁబొండు?

వృద్ధుడు వారిని గొన్నియాహార పదార్థములతోఁ దృప్తిపఱచెను. ఆబాలుర కాఁకలి మాయమయ్యెను. వా

రానందముతో నావృద్ధునిఁ బొగడుచు నాతని యాజ్ఞల శిర సావహించి నెరవేర్చుటకు నాతురులైయుండిరి.

ఈవృద్ధుఁడు దక్షిణాఫ్రికా దేశీయుఁడు. కేప్‌కాలనీ యందుఁ గాపురముండెడి భూస్వామి. ఊసరక్షేత్రములను సుక్షేత్రములుగ నొనర్చుటకై బానిసలు గావలసినందున నందులకై యిండియాదేశమున కేతెంచి చెన్నపురియందు గాపురము కుదుర్చుకొని యుండెను. రాజవాహన రత్నాకరుల దీనసంభాషణ మాలకించి సింహళ ద్వీపమార్గముగా వీరిని నెటాలునకు బంపనిశ్చయించి వారితో నిట్లనెను.

వృ—మీ రీయాచనావృత్తిమాని నెటాలునకేగిన బాగు పడెదరని నానమ్మకము. అచ్చటకేగ మీకిష్టమా?

బా—విదేశవాస మెన్నఁడెఱుఁగని మాకందలి యునికి కష్టదాయకమగునేమో?

వృ—మీకావంతయేని శంకవలదు. అచ్చట నన్నెఱిఁగిన మిత్రు లనేకులుందురు. నేనింతకుమున్నె మీవంటివారి నెంద ఱినో యచ్చటకుఁ బంపితిని. మీరు సమ్మతించిన నిప్పుడే యాజ్ఞాపత్రమునిచ్చి మిమ్మును బ్రయాణమున కాయత్తపఱ చెద. ఇప్పుడే శిలోనునందలి కొళంబునకుఁ బోవు నావ సిద్ధ మగుచున్నది. ఇష్టపడెదరేని తగుసన్నాహములం గూర్చెద.

బాలకు లిష్టపడిరి. తత్క్షణమే యావృద్ధుఁడు వారిని నావికాధ్యక్షుని వశముఁ జేసెను. ఓడ కదలుచుండెను. నావికు

లోడను నడుపుచుండిరి. తెరచాపలు విప్పఁబడియుండెను. గాలి తాఁకుడున కాచాప లల్లలనాఁడుచుండెను. వాయుసంచార మెక్కుడగుకొలఁది గాలిచాపల ప్రచార మెక్కుడయ్యెను. బాలకు లోడయందుఁ గూరుచుండియుండిరి. సముద్రము తరంగసంక్షోభితమై యొప్పెను. జంట జంటలుగ నేతెంచు తరంగములు కొండలంబోలె తండోపతండములుగా వెడలుచుండెను.

ఎన్నఁడు నెఱుఁగని వారగుట బాలకుల కాతరంగసంచలనము కన్నులపండు వొనర్చుచుండెను. ఉదధియందలి చిత్రవిచిత్రములను గాంచి యాయన్నదమ్ములు వెనుకటి దుఃఖమును మఱచుచుండిరి.

ఓడ కొళంబుఁజేరినది. అది యోడరేవు. అక్కడ లంగరు వేయఁబడెను. యానపాత్రములనుండి దిగుమతిసరకులు గట్టునఁజేర్పఁబడెను. ఓడదిగి మన బాలకులు మధ్యాహ్నభోజనమును దీర్చిరి. కొంతసే పాయిసుకనేలను గనఁబడుచుండిన జలపక్షుల పాదముల జాడలఁ గాంచుచుండిరి.

ఇంతలో "గణగణ" మని ఘంటవాయింపఁబడెను. నేటాలునకేగు ప్రయాణీకులోడ వెడలునను భయమున నత్యాతురముగఁ బయిగెత్తుచుండిరి. ఓడయొక్క యీల వీచుల దాఁకుచుండెను. ప్రొద్దయ్యెనని మన బాలకులును నావ నారోహింపఁబోయిరి. కొళంబునుండి నేటాలునకును మధ్య రేవులు లేనందున నావికాపరిచారకు లోడకుఁగావలసిన యుపకరణ

ములన్నియు నందొనర్చిరి. ఓడవెడలు ద్వితీయసూచన వినఁబడెను. గట్టుననిల్చున్నవారు తమతమమిత్రుల కభివందనము లొనర్చుచుండిరి. నెటాలు నెప్పుడు చేరుదుమాయనుకోరిక మన బాలుర కతిశయింపఁజొచ్చెను. వా రతికుతూహలురై యుండిరి. ఇంతలోఁ దృతీయసూచన వినఁబడెను. ఓడకదలెను. మైళ్ళుమఱుఁగయ్యెను. ఆమడ లతిశయించెను. దినములు గడచిపోయెను. ఓడ నడిసముద్రమునఁ బ్రయాణముసేయుచుండెను. ప్రయత్నముల కెట్లో యొక్కొక్కతఱి యంతరాయములు తటస్థించుట సహజము. నాఁడు హఠాత్తుగా నొక పెద్ద తుపానుగొట్టి యోడ దరిదాఁకెను. తత్క్షణమే నావికాధ్యక్షునకు ఓడ దరిఁదాఁకెనను సూచనలనను చరులు చూపిరి. అతఁడు నావను బరికించుటకు మిక్కిలి యాతురుఁడై వెళ్లెను. ఒకచో నొక బిలమేర్పడి యుండినది. దానినిగాంచి యీతఁడు ప్రయాణికులఁ బరికింపఁజొచ్చెను. అప్పుడే నావలోనికి నీరు ప్రవేసించుచుఁ బ్రయాణికుల వస్తునిచయములఁ దడుపుచుండెను. ఓడయం దెల్లెడ నావమునుగుననను భయంకరధ్వనులు వెడలఁజొచ్చెను. చేయునదిలేక నావికాధ్యక్షుఁడు రక్షకతరణులను నీటవేయ ననుచరుల కాజ్ఞాపించెను. అందుండిన స్త్రీపురుషులందఱు పడవలనెక్క నుద్యుక్తులై యుండిరి. నావికాధ్యక్షుఁడు వారితోనిట్లనెను.

"మహాజనులారా! మీకొక విన్నపము. నావ దరిఁదాఁకుట యందఱకు సంతాపకరమే. అయిన నిప్పుడు మీరవలంబింపవలసిన నియమములు కొన్నిగలవు. అవియే నావికాధ్యక్షునకు విధించినయాజ్ఞలు. ఏమందురా? అందఱు నారంభమున

మన కాపాదిల్లిన యాపదనుగూర్చి దేవుని బ్రార్థింపవలయును ఆమీదట బాలికాబాలకులు రక్షకతరణులయందుఁ బ్రవేశింపవలయు పిమ్మట నబలలగు స్త్రీ లందుల కేగవలయు అనంతరము యువకు లాపడవలఁ జేరవలయు. పడవలయందింకను స్థలమున్న వృద్ధు లందుల కేగనగు."

నావికాధ్యక్షుఁ డిట్లు చెప్పెను. పడవలలోనివారందఱు నాలాగున చేయక తప్పదయ్యె. పాపము! ఇంకను వృద్ధులాపడవలను జేరలేదు. ఇంతలో నాయానపాత్రమునం దెక్కుడునీరు సొచ్చి యోడను ముంచివైచెను.

ఓడ రక్షణభారమంతయు నావికాధ్యక్షునియం దుండుటచే వృద్ధులతోడ నాతఁడుఁగూడ నా నీటియందు మాయమయ్యెను.

మనకుఁ బరిచితులగు రాజవాహనరత్నాకరులు రక్షకతరణులఁబడి బ్రతికిరో చచ్చిరో తెలియలేదు.

---

# ఎనిమిదవ ప్రకరణము

---

ఆనాఁ డరణ్యమధ్యమున లలితను, సేవకుల కొప్పగించి చనినహరిదాసు స్థితిగతులు నేఁడెట్లున్నవో కనుఁగొందము. ఇప్పుడతఁడు కమలాపురంబున తన స్వగృహమునఁ బరుండి యుండెను. కాని యాతనికి నిద్దురపట్టుటలేదు.

అతఁడు దుఃఖముచే శయ్యపై నిటునటు పొరలుచుండెను. యోజనా పరిణామములచే నాతనియొడ లుడికిపోవుచుండెను. నిద్రాదేవి యాతని వశపఱుచుకొన భయపడుచుండెను. దుఃఖ దేవత యాతని ముఖమందు నృత్యము సల్పుచుండెను. హరి దాసానాఁడు కొన్ని భయంకరంబులగు సందేశంబుల నాల కించి యుండెను. అప్పటినుండియు నాతని కేమియుఁ దోఁచుట లేదు. ఆతని కానాఁ డాహారముగూడ రుచింపలేదు. వాని మనస్సు మనస్సునలేదు. కాలము విషముముగానుండెను. అతఁ డధికశోకమున మునిఁగియుండెను. ఇంచుకేనియుఁ దాలిమి కలుగుటలేదు, హరిదాసు దృఢహృదయుఁడే! కాని యాఁత డిప్పుడు తన్నావరించిన దుఃఖములకు వశుఁడు గాక తీఱద య్యెను. వానికి జగమంతయు నసహ్యముగా నగపడుచుండెను. తానద్దియో యాలోచించి యాలోచించి తుదకిట్లనుకొనఁ దొడఁగెను.

"హా! లలితా! సోదరీ వియోగకారణంబున దుఃఖి తవైయున్న నిన్ను, మాతృమరణశోక పీడిత హృదయవై యున్న నిన్ను, సోదర విదేశవాస ఖిన్నవైయున్న నిన్ను, నూ రార్చువారెవ్వరు? నీయెడఁ గాలమెంత విపరీతమయ్యె! అయ్యో! అగతికవై, అసహాయవై యంగలార్చు నిన్ను, విడ నాడిపోవ కన్నతండ్రి మనసె ట్లొంగీకరించెనో కదా! త్రాఁగుడు మఱిఁగినవాఁ డింతకన్న నింకేమి సేయఁగలఁడు? ఆదురభ్యాస మాతని నెంతటి క్షీణదశకుఁ దెచ్చెను! బిడ్డలు తన్నుఁజూడ నావేశముఁ జెందుచుండినను భార్య తనరాకకై ప్రతీక్షించు

చుండినను, నెంతకును గృహముఁ జేరక, అందందు మధు వుచేఁ గుక్షి నింపుకొనుచుండెడివాఁ డిప్పుడు స్థానభ్రష్టుఁ డయ్యెనన్న నందాశ్చర్యమేమి? ఆపదలపై నాపదలు వచ్చి నపుడు, హృదయమవశమై పోయినపుడు, భరింపరాని దుఃఖ మున్నపుడు, ఆపన్నివారణమున కుపాయము తోఁచనపుడు నిన్నూరడించువారెవరు ? నిన్నిచ్చటికిఁ దెచ్చుకొందునన్న మీకుంబముపై హేయభావమూని తండ్రి నన్నెప్పుడును రొప్పుచుండెడివాఁడుఁ ఊరకుందునా! యిప్పఁటి నీకష్టములు నాకుఁ గడుసంతాపకారణములుగ నున్నవి. నీయెడబాటన్నో నన్నుం గడుదూరస్థునిఁజేసి నానాఁటికి నెడలు కృశింపఁ జేయుచున్నది. ఏమొనర్పఁగలను? ఎవ్వరితో నాలోచింపఁ గలను? ఏమనఁగలను? మాతండ్రి కట్టడ నుల్లంఘింపనోల్లక కాదే నీదర్శనార్థము రానుంకింపనైతి. తుదకు నినుగననైతి. కడకు దుఃఖభాజనుఁడనైతి. అయిననేమి? ఎట్లయిన నేను నాపరీక్షయందు త్తీర్ణుడనై జయముచేపట్టి నాతండ్రి చిత్త మున కానందముఁ గల్పించి నీపాణిని గ్రహింప నాతనిఁ బ్రసన్నునిఁ జేయనెంచి యుంటిని.

"లలితా! నే నీకమలాపురము వీఁడిపోవక పూర్వ మొకపరి మరల నీసమావేశభాగ్యము లభింపఁజేసికొన నిచ్ఛ గించి యున్నవాఁడ. నీవే నాకన్నులకాంతిరాసివి. హా! ప్రేయసీ! హృదయేశ్వరీ! నేను నిన్నెప్పుడును నెక్కుడుగాఁ బ్రేమించుచుంటిని. ఏనాఁడు, ఏనాఁడు నీవాలుగన్నుల చూ

డుకూలకు గుఱియైతినో ఏనాఁ డతిగుప్తముగా నాదక్షిణకా రాంగుళిని నీతర్జనియం దలంకరించితినో, యానాఁటినుండి యాప్రదర్శనములన్నియు ననుదినము నా హృదయపద్మమున నిలిచి నృత్యమాడు చుండును.

"ఏమియున్న నేమి ప్రయోజనము? నీకష్టములయందు భాగమును బొందనైతి? నిన్నుఁ జూడరానైతి? వియోగభాజనుఁడనైతిని. ఒదవిన యాపదలనుండి తప్పింపనైతిని. నే నస్వతంత్రుఁడనై తండ్రి యధీనమందున్నవాఁడనుగదా? అయ్యో! మన యాంతరంగిక ప్రేమ కెట్టి యంతరాయము లొదవినవి. ఈ తరుణమున నన్ను దైవమే రక్షింపవలయు. ఆనాఁడాటవికుల బారినుండి కాపాడిన పరమాత్ముఁడు నేఁడేల రక్షింపకపోవు? తప్పక యతఁడు నిన్నురక్షించును. దైవానుగ్రహమున నాతండ్రి హృదయము మాఱినఁ దప్పక మనకోరికలు ఫలింపఁగలవు.

"హా! ఫలనాకేఱిత్తకోరికలు! లలితా! శోకించిశోకించి నీవు మఱియొకలాగైనచో నాకీ యల్పసంతోషమున లాభమేమున్నది? నేబ్రతికియుండియునీకెట్టిసహాయమును జేయలేనైతిని."

ఈవిధమున గుందుచు, హరిదాసా నాఁటిరాత్రి శయ్యపై మేనువాల్చెను. శోకవివశతచేఁ బొడమినశోషయో లేక నిద్దురయో కాని యాతనికొక్కింతకూరుకు పట్టెను. రాను రాను నిద్రగాఢమయ్యెను సుషుప్తియందున్న యాతని మానసమున కిపుడించు కేనియుఁ జలనములేదు. అంతట నొక స్వప్నము. అందు ఒక మలినాంగి యాతని యాంతరంగిక దృష్టికి గోచరమయ్యెను. ఆమెధరించినవలువలుకడుమలినముగానుండెను.

వారలుదీరిన కుంతలములు జడలు గట్టినట్లతని కగపడెను. మఱియు నవి కడుమలినములై యుండెను. వదనము వాడి శోకదేవతబోలె కన్నులనీరుగార్చుట నాతడు తిలకించెను.

"నీవు శోకదేవతవా? నీకొదవిన కష్టములందు నేఁ బాల్గొననైతినా? ఎల్లప్పుడు నేను నీహృదయమందుఁ హత్తుకొనియుందునా? అందఱి నెడబాసి యేకాంగివై యున్నదానవా? దుష్టులవలన నీకేమియు భయములేదుగదా? వారి బారినుండి తప్పించుకొన వీలు గనకున్నదానవా? ఇదిగో! తక్షణము వారి నీకత్తి కెరజేసెద"

ఈ తుదిపల్కులు హరిదాసునోటనుండి స్పష్టముగా వెలువడియెను. తత్క్షణమే యాతఁడు పాన్పుపైనుండి లేచి కత్తికొఱకు నెమకుచుండెను. అంతలో నాతని చంచలిత మానసము జాగ్రదావస్థ ననుసరించెను, ఆవేశించిన యామలినవిగ్రహము మాయమయ్యెను. అపుడపుడే భానుడుదయాద్రి నలంకరించి నట్లుండెను. హరిదాసుఁ డిట్లనుకొనెను. "ఏమిది? ఇది స్వప్నావస్థయా? నిజమును నిరూపించుచున్నట్లున్నదే! సాక్షాత్కారిణి యగునామలినాంగి యెవరగుఁ? నాలలితకాక మఱియెవరు? ఆపె దురాత్ముల దుండగములకు గుఱియైన ట్లీస్వప్నాభిప్రాయము గదా' ఇఁక నాలస్యనముఁన కెడములేదు. ఇపుడేవి జయనగరమునకు కమ్మవ్రాఁసి లలితక్షేమ మారయువాడ" నని యందుండి వెడలిపోయెను.

---

# తొమ్మిదవ ప్రకరణము

సోమనాథుని కుటుంబము విచ్ఛిన్నమైపోయినది. సంసారమునుభరించు దిక్కులేమి నాకుటుంబము కూడుగుడ్డలకుఁ కడునలుగుచుండెను. ఎన్నాళ్లని యాకటిబాధ సైరింపగలరు, లలిత యన్నదమ్ములు తమ జీవనమునకు గతిగానమి విదేశవాసులై చచ్చిరో బ్రతికిరో తెలియదు.

లలిత బాలిక. ఎందుబోఁగలదు? ఏమిసేయఁగలదు? కొంతవఱకుఁ బొరుగింటి యాదరణకులోనైయుండెను. ఆప్తులిచ్చెడి యాహారముచేఁ దృప్తినొందుచుండెను. ఆమె గుణవతియని ముందే చెప్పియుంటిమి. పలుమాఱు పొరుగిండ్లకు బోజాలకుండెను. పరుల యాచింపనొల్లకుండెను. స్వగృహమును వీడ నిష్టములేకుండెను నిరంతరముదుఃఖ వివశయై కాలము గడుపుచుండెను. ఒకనాడామె నేలపైఁ బఱుపబడిన రత్నకంబళముపైఁ గూర్చుండి, పార్శ్వముననున్న తలగడపై నెడమమోఁచేతినూని కరపద్మమునఁ జెక్కిలిఁ జేర్చుకొని దక్షిణహస్తమందలి లేఖను మాటిమాటికిఁ జదువుకొనుచు నెక్కింతసేపట్లైయుండి యొక్కనిట్టూర్పుఁబుచ్చి తుదకాలేఖను దలగడ క్రిందదాచి స్వగతముగ నిట్లనుకొనఁ దొడగెను.

“అకటా? ఏమి ఈ పాపిష్ఠిలోకము! తండ్రిఁశివమెత్తి దేశదిమ్మరియయ్యెఁ. అతనిదుండగములకై కృషించి కృషించి

తల్లి మరణించె. సోదరులుదరఘూరణార్థమై స్థానభ్రంశులైరి. హా! మాకుటుంబమున కింతటి పాటుకలె? ఇఁక నాశీలమున కెట్టి యుపద్రవమురానున్నదో కదా! వారిపోకడఁ దెలియకయహో రాత్రములంగలార్చవలసివచ్చెనే! ఏమి నాకర్మము. తల్లిదండ్రులు దరిలేక విచారసాగరనిమగ్నయగు నన్నించుకైనను జాలిఁదలపక భయంకర నిశాసమయంబున కాలుసేతులు బంధించి శవమువోలె నన్నికర్వారులు పురివెడల ద్రోయుదు రట. హా దైవమా! ఇఁక నాకెవరుదిక్కు? నీవేనాకుశరణ్యుడవు. నేనేమి నిన్ను బల్లెరపూలపూజించియుంటినా? కాకరాలనర్చించితినా? నన్నేల యిన్నికష్టములపాలు సేయుదువు? ఈబాధల నుండి తొలగు నుపాయమేద్ది? ఎద్దియుదోపక యపారంబగు శోకంబున మునింగిపోవుచున్న నన్ను గట్టెకించు ఘనులెవరు? ఆపద్బాంధవా! పుడమిపై స్త్రీ గాజన్మింప జేసినవాడవు నీవు నన్ను సాధారణకాంతలవలె నేలపుట్టింపవైతివి? సౌందర్య రాసులయందొక్కర్తుగ నేల జన్మింపఁజేసితివి? నేనే కురూపినైనచో నాకిట్టిబాధలు కలుగవుకదా? ఇంకేమిసేయుదు! సేయున దేమున్నది. ఒకటిమాత్రముదోచుచున్నది. సౌందర్యమునుదాచి కార్యము నడంచి శీలము నేఁటగల్పఁ గస్తిపడుచుండు మానసమునకు ధైర్యమొసంగి సంతాపాదులచే మరణమే గతిగానున్న నన్ను మన్నింపుమని యతని దీనముగాఁ బ్రార్థించిన, నాతఁడు శాంతచిత్తుఁడగునేమో. అయ్యో! అదెట్లుఘటించు? నావినయ విజ్ఞాపనంబు లాతనిహృదయమున కెక్కునా ఆత్మ విజ్ఞాన శూన్యులకు యుక్తాయుక్తవివేచన మెట్లుకలుగును

మదోన్మత్తులగువారు, పుణ్యకార్యముల సరకుగొందురా? నన్ను వారు బ్రతిమాలుట పిచ్చిగుంటపై భాగీరథి ప్రవహించినట్లేగదా? ఐశ్వర్యమునందు వారధికులే యగుదురు. కులశీలంబులఁ దలఁపవలదా? బలసత్వసమేతులగువా రొకవేళబలవంతముగాఁబట్టిన నాగతియేమి? అట్టి కఠినకాలము దాపరించు తరుణమొదవినఁ దలదాచుకొనఁ దావెయ్యది? ఆనాఁడతఁడు సంతోషమున బదులుచెప్పుమని వేడుకొనెను. మరల నేతెంతునని సూచించెను. బలవంతముగా బట్టుదునని భయపెట్టెను. సమ్మతియగుమాట నిమ్మని త్వొందరపెట్టెను.

"కట్టా! శిలాహృదయులు నన్నూరక విడుతురా! ఎట్టి సాహసము లొనరింతురో? ఏపన్నుగడలఁ బన్నుదురో? తుద క్షేమిసేతురో! ఎద్దియు దోపకున్నది. అగునది కానిమ్ము. కానున్నది కాకమానదు. ప్రాణములు తుదముట్టబోయినఁ బోనిమ్ము. నేనంకుల కొడబడను. హరిదాసే నాప్రాణధనము, దగ్గఱిచుట్టము, అతనికి నాయందు అత్యధికమైన యనురాగము అట్టి ప్రియుని వీడి యిట్టి తుచ్ఛమానసులఁ జేపట్టి కులకలంకమున కెడమిత్తునా? అదియబద్ధము.

లలితమానస మిట్లు కలవరపడుచుండెను. అట్టితరుణమున నొక యువకుఁడు తా ధరించిన విలువగల వస్త్రములు గాలితాఁకున నల్లలనాడుచుండ, పాదములనున్న పాదరక్షలు నడచునప్పుడుమడిమలతాకున "చిటుకు చిటుకు" మని ధ్వని

సేయుచుండ నాగృహమునఁ బ్రవేశించెను. అతడు తలపై ధరించిన శిరోవేష్టము చిత్రమగు కలికితురాయిచే శోభిల్లుచుండెను. అతనియధరములుతమ్మలపురసముచేఁ గెంపుఛాయల నధివసించుచుండెను, ఆతనిచూపులు సౌమ్యముగాలేవు. ఆతని దక్షిణకరమున స్వర్ణలతలచే మనోహరమై సింహలలాటపుపిడి గల దంతపుబెత్తమొప్పులు గులుకుచుండెను. అది యాతని చేతిలోఁ దిన్నగా నిలువక యిటునటు జరుగుచుఁ దలక్రిందుల గుచు వాహ్యాళి సేయుచుండెను.

అతనియెడమచేయి మాటిమాటికిని సూనూగు మీస ములపైకిఁ బోవుచు వాని కొకవింతసొగసు లిచ్చుచుండెను. ఆపురుషుఁడుమెల్లగా, నొయ్యారముగా; సగర్వముగా లలితను డాసెను.

లలిత కెందలిగుటకును పాదము లాడవయ్యెను. అమె యేమియును జేయజాలక స్థాణువువలె నిలువబడిపో యెను. అదియును నతనికి విలాసముగనే తోచినది. అమె ముఖమండలముఁ గాంచినతోడనే తీక్ష్ణమగు వానియాకారమం తయు మాఱిపోయినది. "బెబ్బులి గొఱ్ఱెపిల్ల యైనది. సింగము పిల్లియైనది." అతడు మందస్మితవదనుఁ డయ్యెను. అది యతని దీనభావమును వెల్లడిజేయుచుండెను. అతడిట్లుఁ జెప్పదొడగెను.

లలితా నన్నుజూచి యిట్లులరిచ్చపడియెదవు. నేను నీకు దాసుఁడను. నీపైనున్నయాశ, నీయందలి యనురాగము నన్నిన్ని చిక్కులబడద్రోసె; గావున నీయుదారవీక్షణములచే నన్ను ధన్యునిగావింపుము.

పాపము! లలిత భయకంపితయై యుండెను కన్ను లశ్రుపూరితములై యుండెను. ముఖారవిందంబున జిఱుచెమట లెసగెను. అధోముఖియై నిలుచుండెను.

స్త్రీల మానసంబులు తరంగచంచలములని స్వభావ మెఱుఁగని పురుషు లెందరెందరో వాదించెదరు. అట్టివారీసమయమున నిజముగా లలితను జూచియుందురేని యామెగుణమును గుర్తింప గలుగుదురేని, యామెభావమును దెలిసికొన గలుగుదురేని, తప్పక తమవాదమును వదలివేయుదురని మా నమ్మకము. ఆపురుషు డామెలక్షణముల బరికింపలేదు.

: ఆమె సిగ్గుచే మాటాడ లేదని యతఁడు దలచెను. అతఁడు వసంతుడని యతనివాక్యములనుబట్టి చదువరు లెఱిఁగియుందురు అతఁడిట్లనెను.

"సుధను త్యజించి గరళమును మ్రింగెదవా? మాణిక్యమును వీడి మంటిపెల్లల నేరెదవా? కల్పవృక్షమునువీడి కాలిన మ్రోడు నాశ్రయించెదవా? ఇంచుక యోజించుము."

మార్జాలము చెంతనున్న మూషికాంగనవలె లలిత గడఁగడ వడఁకసాగెను! కాని, కాళ్ళుకదలవయ్యె. ఏమిచేయుటకును దోఁచదయ్యెను. సహాయ్యముగా నరుదెంచువారు గాన్పింపరైరి. కనుఁగొలుఁకులనుండి వెడలు నుష్ణాశ్రుపులామె కొంగును దడిపివైచు చుండెను. ఆమె మానము వహించిలోలోన దైవమును బ్రార్థించుచుండెను. తుదకిట్లనుకొన దొడఁగెను.

"హా! దైవమా! నాకేల యిట్టి ముప్పుతిప్పలు గలుగఁ జేయుచున్నావు. తల్లియు, సోదరియు స్వర్గస్థులైరి. తండ్రియు,

సోదరులు స్థానభ్రష్టులైరి. ఇప్పుడు నేనుఁగూడ నీగృహమును వీడక తప్పదయ్యె. లేదేని నామర్యాదకుఁ దప్పక ముప్పు వాటిల్లును."

వసంతుఁ డొక్కింతసే పూరకుండెను. లలిత ప్రత్యుత్తరమున కెదురుచూచుచుండెను. దిండుక్రిందనుండి కొంచెముఁగాఁ గాన్పించుచుండిన లేఖ యాతనికి గోచరించెను. అనుమానముఁదోప, "లలితా! బాగుగ నాలోచించుకొనుము. ఇంకను గొంతకాలము గడువిచ్చెద"నని తత్క్షణమే యాలేఖంగైకొని వెడలిపోయెను.

సమయమునకై వేచియుండిన లలిత యిదే యదనని తలఁచి వేఱొకద్వారముగుండఁ బలాయితయయ్యెను. కొంతసేపటికి వసంతుఁడు తనమిత్రులతో లోని కరుదెంచెను. అందు లలిత గానఁబడదయ్యె. వారాగృహమంతయుఁ బరికించిరి. కాని, వారిప్రయత్నము నిష్ఫలమయ్యెను.

---

# పదియవ ప్రకరణము

---

"అయ్యా! భిక్షమిండు, అయ్యా! భిక్షమిం"డని యొకవ్యక్తి కమలాపురపు వీధులవెంబడిఁ దిరుగుచుండెను. కాలము సంధ్యాసమయమునకు రెండుఘడియ లతిక్రమించి యుండెను. అదివఱకు లోకమునఁ గాఱుచీకటులుఁ గ్రమ్మియుండెను గాని

యపుడపుడే మేఘమాలల మఱుఁగుననుండి వెడలి జాబిల్లి కమలాపురపు సందుగొందులను శ్వేతవెన్నెలచే నింపించు చుండెను. మినుకుమినుకుమని ప్రకాశించెడి నక్షత్రరాసి ధవళకిరణుని శ్వేతకాంతులకు భీతిల్లెనోయన, తమ స్వప్రకాశ మును సంపూర్ణముగాఁ జూపలేనివయ్యెను. ఆకసమం దచ్చట చ్చట నిండుధావళ్యమునఁ గన్పట్టెడు కొండలవలెను, శరధి తరంగములవలెను, పెక్కురూపములు దాల్చి యందముఁ గన్పట్టెడి మేఘమాలికలు విరాజిల్లు చుండెను.

భిక్షమాసించుచుండిన వీధియందే మనకథానాయకుఁ డగు హరిదాసుని మందిరముండెడిది. హరిదాసు మందిరపు ముంగిలియం దిరువురుయువకు లెందుకో వేచియుండిరి. భిక్ష మును యాచించుచుండిన వ్యక్తిగూడ నామార్గముననే వారికి సమీపమునఁ బోవుట తటస్థించెను. పదునాఱేండ్ల యీడుఁ గల యాభిక్షుకుఁ డిందుండిన యువకులంగాంచి ఝంకుక సంకో చింపఁజొచ్చెను. ఇంతలో లోపలనుండి హరిదాసు బయటకే తెంచి "ఎవరు? నాకైయిచటకాచియున్నవారు?" అని యువకులఁ బ్రశ్నించెను. "అన్నా! మేమే, రమ్ము నీతోనొక రహస్య మును మాటాడవలసియున్నది. నీదర్శనమునకై మూఁడు రోజులనుండి గాచి యిప్పటికినినుదర్శింపఁగలిగితిమి. రమ్ము. మావెంటఁ బోద" మనిన్నియువకులనిరి. హరిదాసు వారివెంట నడువసాగెను. ముచ్చువుమూర్తులును నాంతరంగిక మిత్రులవలె నొకరికరం బొకరు పట్టుకొని, చూవెన్నెలరాత్రులందు నడచు చుండిరి. వీరెచ్చటికి బోవుచుండిరో యాస్థలమును గనుఁగొను

టునా కావశ్యకముగదాయని భిక్షుకుఁడనుకొనెను. ఇప్పుడతఁ డచ్చట నిలుచుటకు సమ్మతింప లేదు. భిక్షుముఁగుట క్లిష్ట పడుటలేదు. వాఁడు ఆముప్పురుఁజేరెడు గమ్యస్థానమును దానుగూడఁ జేరవలయునని త్వరపడుచుండెను. మానసే మార్గం బవలంభించుట కతఁ డసమర్థుండుగదా? అయినను ముందజేగిన ముప్పురుమూర్తుల కించు కెడముగా, నీభిక్షుకుఁ డరుదెంచుచుండెను. నిమేషములుదాటెను. గంటలు పరువి డెను. మూఁడుగంటలకాలమిట్లే వీరందఱు నడువఁజొచ్చిరి. అప్పటి కర్ధరాత్రియైయుండెను. వీరరిగిన దొకవిపినభూమిగా నుండెను. వారందరచ్చటనాగిరి. యువకుఁడు ఒకలేఖను దీసి, హరిదాసునకిచ్చి యిది యెవరి వ్రాతయని ప్రశ్నించెను.

హరిదాసు—(ఆవెన్నెలరాత్రులందు నామూలాగ్రముగా లేఖ నవలోకించి) ఇది నీకెట్లుఁజిక్కినది? ఈవిషయము కడుగోప్యము. అయిన నిది నాలిఖితమే.

యువకుఁడు—ఎవరికొఱకు?

హరి— నాలలితకు.

యు—నీహితముఁగోరి నీకుపదేశింప నిన్నిందులకుఁ బిలుచుకొని వచ్చితిని. నేనిప్పుడొక రహస్యమును దెలుపఁబోవు చున్నాడను. దానిని నీ వంగీకరింపక తప్పదు.

హ—విషయము వెల్లడింపుము. ఆలోచించెద.

యు—నేను చాలకాలమునుండి లలితను ప్రేమించియుంటిని. ఈలేఖను గాంచినదాది నీపై నాకసూయ పొడమినది. దానిఁబాప నినుగోరుటయే నాకోరికె.

ఈమాటవినఁగానే హరిదాసుమోము వెల వెలఁ బాఱెను. ఒకసారి తలపైఁ బెద్దపిడుగుఁ బడినట్లయ్యెను. ఆలోచన దోఁచుటలేదు. అమృతమయమగు లలిత తనహృదయకమలమున విషాంకురము నాటినదనుకొనెను, దిక్కుదోఁచుటలేదు. మంతనము శాంతముతో నిలుచుటలేదు. అతఁడూరక నిలచి తీవ్రయోచనాసక్తుఁడై తనలోఁ దానిట్లనుకొనఁ దొడఁగెను. "లలితకును వీరికిని నన్యోన్యానురాగ మెట్లొదగూడినది? ఒక వేళ కష్టసమయమున నితఁడామె నాదరించియుండునా? లేక లలితహృదయ మేమైన మాఱియుండునా? లేకున్నయీ లేఖ వీరికెట్లుఁజిక్కెను? వీరెందులకిట్లరుదెంతురు? అయ్యో! పొరబడితిని. లలిత, నాలలిత సర్వోత్కృష్ట గుణగణవిరాజితయగు లలిత, నన్నే ప్రాణభర్తగాఁ బ్రేమించిన లలిత, నారాకకై యెదురుఁజూచు లలిత, యీనాఁడు నా వలనరక్షితయైన లలిత, నన్నువీడి వీనినంగీకరించి యుండునా? కల్ల" (ప్రకాశముగా)

హ—లలిత నిన్ను బ్రేమించినదా ?

యు—ప్రేమానుబంధములతో నాకక్కఱలేదు. ఎట్టులైననేమి ? ఆమెను తప్పక వశపఱచుకొనఁగలను.

హ—ఎట్లు ?

యు—నయముననో, భయముననో, నిర్బంధముననో.

హ—ఆమె యిపు డెచటనున్నది ?

యు—నాయాటోపమున కాఁగజాలక పాఱిపోయినది.

హా — (ఆగ్రహోదగ్రుఁడై యాఁకలిఁగొన్న బెబ్బులి మాడ్కి- యఱచుచు) ఛీ! దురాత్మా! ద్రోహీ! ఇదియా నీవు నాహితమును గోరుట. అధర్మమునఁ దేజోహాని గలుగునని నీవెఱుఁగవా? అబలలను బలాత్కరించుట పాపమని నీకుఁ దెలియదా? యుక్తాయుక్త వివేచనము లేక, మోహవికారమున మునిఁగి, కన్నుఁగానక, పాపభీతి లేక, సుశీలయగు నొక యబలను, నయమున, భయమున, నిర్బంధించి పురివెడల నడపితినని ప్రేలుచుంటివా? జాగ్రత! ఇది నీయూరుఁగాదు. నేఁ గినిసిన నిన్నాదరించువా రిచట నెవ్వరును లేరు. కానిమ్ము. దీనికిఁ దగినఫల మనుభవింపక మానవు. ఇట్టి నీచుని దైవము దండింపక మానఁడు. ఇపు డాలలితక్షేమము నారయుట నా ప్రథమకర్తవ్యము. ఇప్పటికి నిన్ను మన్నించితిని. చాలు నీమైత్రి. ఇఁక నేఁబోయివచ్చెదను.

"తాటాకులచప్పుడులకు కుందేళ్ళదరునా? ఎటులబోయెదవు? నీబెదరింపుల కిచట భయపడువా రెవరును లేరు. ఆలోచించుకొనుము. మనముండునది దుర్గమారణ్యము. నీవిపు డసహాయుఁడవే గాక నిరాయుధుఁడవై కూడనున్నవాడవు. నీకుఁ జంకుటకు నే నబలుఁడనుగాను. ఇదిగో నాచేత నేమున్నదో చూడు"మని యువకుఁడు తటాలునఁ దనయొరయందుండిన కరవాలముఁ బెఱుక నావెన్నెలరాత్రియం దాఖడ్గపుకాంతుల తళతళలు హరిదాసుని కన్నుల మిఱుమిట్లుఁగొలిపెను. "హా! పరమేశ్వరా! ఈయరణ్యమధ్యమున నన్నొంటరిగఁజేసి సామా-

న్యమానవుని చేతులయందు నాయసువులను బాపనుంటివా?" యని హరిదా సనుకొనుచుండెను.

ఆ యువకునిజంటనున్న యాతనిమిత్రుండు "ఆలసించెద వేల? నీవాతని నాకరవాలమునకు బలిసేయుము? ఇదియే నీలలిత కానందమని నెక్కివక్కాణింపు"మనెను. యువకుండు క్రోధారుణితనేత్రుండై తటాలునఁ దనఖడ్గమును బైకెత్తెను.

పాఠకులారా! ఏమూలనుండి యేతెంచెనో! ఎట్లరుదెంచెనో! గాని, భారతయుద్ధమున సాత్యకిబాణము గొనకొంచిన భూరిశ్రవుని కరము గగనమున కెగసినటుల యొక యర్థచంద్రబాణము ఒక్కత్రుటిలో ఖడ్గముతోపాటు యువకుని భుజమూడి పైకెగయునట్లు జేసెను. యువకుఁడు తటాలున క్రిందఁబడిపోయెను. తత్క్షణమే హరిదా సాఖడ్గమును గైకొనెను. హరిదాసాదుల సంభాషణమును వినుచుండిన వ్యక్తి సత్వరమున నందుల కేతెంచి, యింకను జూచెదరేల? తత్క్షణమే వీని విగతాసునిఁజేయు"మనెను. హరిదా సాశబ్దమువిని,

హ—"ఈధ్వని నేనెప్పుడో విన్నట్లున్నది"—నీవెవరు?

వ్య—నేనెవరైననేమి? ప్రథమమున, వీని గతాసునిఁ జేయుము. ఆవల నాకథనంతయు విన్నవించెద.

హ—తుదముట్ట వీనిజంపి పాపభాజనుడఁ గమ్మందువే?

వ్య—అవును. దురాత్ములఁద్రుంచినగాని లోకము బాగుపడదు. ప్రజలు సుఖంపరు. అభీష్టములు నెరవేఱవు. జగ

మానందింపదు. హరిదా సాకడపటిమాటల నాలోచించుకొను చుండెను. గుక్కుమిక్కురమనక కూర్చుండియుండిన యువకుఁ డిదే తరుణమని పరువిడనారంభించెను.

హరిదాసునితో సంభాషించుచుండిన భిక్షుకుఁడు వెను వెంటనే పరుగిడి యాతని జుట్టుఁబట్టుకొని "పోకుపోకు" మని నిలువరించెను. ఆధ్వనిని విన్నతోడనే "అమ్మా! తల్లీ! నీవిందు న్నావని తెలియకపోతిని విజయనగరమున లలితవైయుండిన నీవు నేఁడీవిపినములో వసంతునకు మృత్యుదేవతవై యుంటి వని తెలియకపోతిని. నన్ను మన్నించుము. నీవు సత్యవతివి. నీశీల మింతటిదని తెలియనైతిని. నీశీలమును జెఱుపనెంచిన యీనిర్భాగ్యునకు దేవుఁడు తగినదండన విధించెను. ఈజన్మ మున నేనిఁక నీజోలికిరాను. శాంతమూని నన్ను మన్నించుమని యామెపాదములపైఁ బడెను. వ్యక్తికిఁ జాల జాలికలిగెను. "జయంతా! ఈజన్మమున పతివ్రతల గన్నెత్తియైనఁ గనుఁగొనను ననని ప్రమాణమొసగుము. నేను నిన్ను హరిదాసునెదుట క్షమించెద."

చదువరులారా! జయంతుని ప్రసంగము నాలకించిన మీకు భిక్షుకుఁడు లలితయని వేఱుగాఁ జెప్పవలయునా?

భిక్షుకుఁడును హరిదాసుఁడును యెందులకో వెడలిపో యిరి. వసంతుఁ డందే మరణించెను. శరణాగతుఁడగుట జయం తుఁడు బ్రతికిపోయెను.

---

V. H. Krishn...

# పదునొకొండవ ప్రకరణము.

విజయనగరమందున్న వసంతునకు వామనుఁడు తమ్ముఁడు. వామనుఁడుగూడ వసంతునివలెనే దుష్టవర్తను దుర్వృత్తియందుఁ దన యన్నవలె నితఁడుగూడను స్వేచ్ఛావిహారమునఁ దిరుగుచుండెడివాఁడు. "ఓగునోగుమెచ్చు"నను సామెతను సార్థకపఱుప వామనుఁడు తనయన్నయం దెక్కుడైక్యమును జూపుచుండెను. దుర్వ్యయ మొనర్చుటయందేమి తల్లిదండ్రులకుఁ దెలియకుండ ఇంటిసొమ్మపహరించుటయందేమి, ఇంటి నగలు చేఁజిక్కినపుడు స్వక్షేత్రముల దాఁకట్టుఁబెట్టి ఋణముఁ దెచ్చుటయందేమి, వీరన్యోన్యమైత్రిగలిగి మెలఁగుచుండిరి. వసంతుని మరణవార్త జయంతునిచే విన్నదాదిగా వామనుని హృదయమందొక విషాంకుర మంకురించెను. హరిదాసుపై నీరసాసూయాదులు పెరుగఁజొచ్చెను! గౌరవపాత్రమైన కుటుంబముయొక్క పేరుప్రతిష్ఠలు తగ్గెనని సిగ్గుపడజొచ్చెను. హరిదాసుచే నొదవిన యాబన్నమును బాపికొనదలఁచి తుదకొకనాఁడు జయంతునితో నిట్లుత్తరప్రత్యుత్తరములు నడిపెను.

వామనుఁడు—జయంతా! మాయన్న మరణవార్తవిన్నది మొదలు నామనము మనమునలేదు. ఏపనిఁజేయుటకును బుద్ధిమాంద్య మొదవినది. హరిదాసొనర్చిన క్రూరకర్మమునకు ప్రతీకార మొనర్పలేని నేను జీవన్మృతుడనే. నామరణమునకై నేనించుకేనియు సంకోచింపను గాని హరిదాసు జీవించుటను

జూచి నే నోర్వలేను. నాకు వాడు పరిచితుఁడగుట నీవిషయ
ములన్నియు నామనమున కెక్కుడునొప్పిఁదోఁచుచున్నవి. దిక్కు
దోఁచక నిరంతరము గుందుచున్నవాఁడ. దీనికేమి సేయ
మందువు?

జయ—నామిత్రుని జంపిన హరిదాసుపై నీర్ష్యా
సూయాదులు నీకంటె నాకెక్కుడేగాని ఆవిష్టినతలమున
నాకును నట్టిప్రాప్తియే గలుగునని వెఱచితిని. ఇఁక నేనట్టిపనికొ
డబడనని వారితో ప్రమాణమునొనర్చి చిక్కువడియున్నాను.
నీవడిగిన యుత్తరమునకు ప్రత్యుత్తర మియ్యజాలను.

వామ—జయంతా! ఏల యింత బేలవయితివి? సామాన్యు
డగు నొక్క మానవునకై యింత వెఱవవలెనా? ధైర్యమూని
పగ సాధించినఁగాదే వసంతుని ఋణముఁ దీర్చుకొనిన వార
మగుదుము?

జయ—అదినిజమే. వారి యన్యోన్యమైత్రి యపారమై
నది. మన మొనర్చు మాయోపాయములకు వారు చిక్కు
వారుగారు. లలిత యబలయయ్యును గుప్తగామినియై హరి
దాసువెంట సబలసత్వసంపన్నయై మెలగుచుండును. హరి
దాసునకాయుధసాధనము లెక్కుడుగా నున్నట్లు దోఁచుచు
న్నది. మనయందట్టి చతురత కానరాదు. కాన నాయత్నమును
మానుదువని నావేఁడుకోలు.

వామ—జయంతా! లోకమునందు హరిదాసొక్కరుండ
బలదర్పసంపన్నుఁడని మెంచుట కేవలము వెఱ్ఱితనము. లలిత

యొక్క తెలియు చాకచక్యధురీణయని యెంచుటయు నట్లే. దీనికంతయును ప్రయత్నమే ప్రాముఖ్యముగా నెంచి ధీయుత్నుఁ జేయవలయుగాని, పిఱికివడం బోయుట పాడిగాదని నా కోరెక. కాన నీవిషయమున నేదేని యొక కర్తవ్యమాలోచింపక తీరదు.

—ఈ క్షణముననే వానినణఁచుట మనచేతఁ గాదనుకొందును. ఉపాయాంతరమున నీ యీప్సిత మీడేరునేమో?

వామ—ఎట్లో! ఆయుపాయములన్నియు నాకుదోపవు. నీవొనర్చు నుపాయముల కన్నిటికిఁ గావలసినంత ద్రవ్యమే గాక జనసహాయముఁగూడ నేఁజేయ సిద్ధముగా నున్నవాఁడను.

జయంతునకిపుడు విధిలేకపోయెను. లలితా హరిదాసులకిచ్చిన ప్రమాణమునుబట్టి యతఁడేమేమో యాలోచించుకొనసాగెను. మిత్రమృత్యువును గుఱించి యతనిమానస మొకవంకవే ధ్వంచుచుండెను. వామనుని యీర్ష్యాసూయాదుల కతఁడచ్చెరువొందజొచ్చెను.

"అగ్రజునిమరణానంతరమునఁగూడ వామనున కీయభిమానముదయించుట, వానిస్వధర్మమును జాటుచుండెఁగదా" యని యనుకొనెను. మిత్రఋణ ముఁ దీర్చుటయందప్రమత్తుఁడుగాక మెలఁగుట యాతనిక ధర్మమని తలంచెను. మరల వారిరువురికిట్లు సంభాషణము ప్రారంభమయ్యెను.

వా—జయంతా! ఏల యూరకుంటివి?

జ—ఆలోచనము దోచుటలేదు.

వా—మేధాశక్తిసంపన్నుఁడవగునీ కీయూహాయుఁబొడమ కున్నదన్ననాకే సిగ్గగుచున్నది.

జ—కపటంపుటూహాలు బన్నుట కడుఁగష్టము ఉరి నొడ్డిన పక్షిపడితీరవలయును.

వా—కాలక్షేపముతో నాకుఁబనిలేదు. సావధానముగా నాలోచించియే తగిన యుపాయ మనుగ్రహింపుము!

వామనుని మానసమునగూడ నిపుడొకయూహతట్టె ను. ఆపన్నుగడసాంగోపాంగముగ సాగునని యాతని ముఖ భావము సూచించుచుండెను. అతనిమది సమాధానపడియున్న దని యాతనిమోముఁనందలిచిఱునవ్వే తెలుపుచుండెను. ఒక్కపరి తన మీసముపై వ్రేళులఁద్రిప్పుచు నతఁడు జయంతునితో నిట్లనెను.

వా—జయంతా! లలితా హరిదాసుల యన్యోన్యానురాగ మున కంతరాయంబొదవినగాని మనయభీష్టములు సిద్ధింపవు.

జ—అది విచ్ఛిన్నమగు త్రోవయేది?

వా—వాని వ్యామోహము వేఱొక యువతిపై పరిణ మించునట్లుఁ జేయుటవలన.

జయ—ఈమార్గము మనకంత యాయాస మొసఁగునది కాదు. కేవలము ద్రవ్యవ్యయముపై నాధారపడునట్లున్నది.

వా — దానికి నే వెనుదీయువాఁడనుగాను. కొంతపైక ముతో మనమిపుడు కమలాపురమున కేగవలయు. ప్రేపటి యుదయమున నే కమలాపురప్రయాణము స్థిరీకరించితిని.

తగు సన్నాహము లొడగూర్చెదనుగాని యీప్రయత్నము నందుగూడను సఫలీ కృతులమగు దుమనుయాశ మాత్రము నాకు లేదు.

అని యాయిరువు రందుండి వెడలిపోయిరి.

---

# పంద్రెండవ ప్రకరణము

---

ఒకనాఁటి మట్టమధ్యాహ్నమున నొక మనుష్యుఁడు జలతారు బుటేదారి పనిచేయఁబడిన మాంజిష్ఠ శిరోవేష్ట మును ధరించి, వలచేత నొక సొరకాయబుఱ్ఱయు దాఁపలిచే నొక కరదండమును, దండమునత్తి యొక చెంబును పట్టుకొని యొక పెందెరువున బిరబిర నడుచుచుండెను. అతఁడు వయస్సు చెల్లినవాఁడగుటచే నాతని చర్మమించుక ముడుతలు పడియుండెను. ధరియించిన తలపాగా పురాతనమైనదగుట నచ్చటచ్చటఁ జినిగి మైలవడి యుండెను. అతఁడు ధరియిం చిన వస్త్రములు కడు ముటికివై చూచుట కసహ్యతఁ గొల్పు చుండినవి.

అతని హస్తమందున్న వేత్రపుపిడి వెండితీగలచే నతి మనోహరముగా నల్లబడియుండెను. అతఁడు మాటిమాటికి నాసారకాయ బుఱ్ఱనుండి దేనినో క్రోలుచు కాళ్ళు తడఁబడఁబోలుచు సొక్కుచు నడచుచుండెను. ఒంటరిగ నడచుచుండియు, నాతఁడు దనవెంట నింకెవ్వరో యుండినటుల నుత్తరప్రత్యుత్తరములు సలుపుచుండెను.

ఆబాట కిరుపార్శ్వముల నత్యున్నతములగు వృక్షములు చాళ్లుదీరియుండెను. అవి యొక్కటొకటితోఁ గలసియున్న శాఖోపశాఖముగా విజృంభించి, వానియందు దట్టముగాఁ బెరిగియున్న యాకులచే విరాజిల్లుచు నెండవేళలందు దారినడచు తెరువరుల యాయాస నివారణార్థమై చల్లని నీడల నిడుచుండెను.

ఆమార్గమున నింకెవ్వరో కొందఱు బాటసారు లేగుచుండిరముదుసలివారిని దాఁటి కొంతదవ్వరిగిః పదంపడి వారితట్టొక్కింతసేపుగాంచితలనూచి "పొమ్ముపో"మ్మని పలికి మగుడ యామనుష్యుఁడు నడచుచుండెను. ఇట్లస్పష్టముగా మాట్లాడుచుఁ దడఁబడ నడుగుల నిడుచు దూఁగుచుఁ దూఁగుచుఁ బోయిపోయి యాతడొక పాదపముక్రింద దబాలునఁబడెను. ఆవృద్ధునకు మైక మెక్కుడగుట నవయవసంచారమాగినది. ఆతఁడు స్తబ్ధుడయ్యెను.

కడువృద్ధుఁడని దయఁదలఁచి కొంబోలు సమీపమందుండిన తెరువరు లావృద్ధున కుపచారమిడఁ బరువిడిరి. కొం

దఱు వస్త్రములతో వీవఁదొడఁగిరి. మఱికొందఱు స్వేదజల ముచే మోముఁదుడుపుచుండిరి. ఇట్టి శుశ్రూషలఁ దెలివిరాఁగ నందఱు గుమిఁగూడి పరిసరముననున్న యొక నూతిచెంత కతనిఁ గొంపోయిరి. అతని చెంబునిండుగ నీరుఁదెచ్చి శిరస్స్నాన మొనరించిరి. ఇంచుక సేపటిలోనదృ జరాభారపీడితుఁడగు నాఁ తఁడు వడవడ వడఁకుచు సేదదీరెను.

"హా! సుశీలా! సుశీలా! మాసుశీలను గానరా?" యని యందున్న యొకని నడిగెను. "మా హైమవతి మాయమైనది నిజమా?" యని యింకొకరినడిగెను. "రాజవాహన రత్నా కరులఁ గాంచితిరా?" యని వేఱొకని నడిగెను.

"లలిత నారయనేఁ బోవుచుంటినిగదా?" యని మఱొ కనిఁజూచినవ్వెను. "నేవెడఁగునైతినే," యని గోడుగోడున నేడ్వ సాగెనుఁ "చేతికఱ్ఱనిచ్చెదగాని కల్లుఁ దెచ్చెదవా?"యని చెంత నుంచిన బుట్టి నొకనికియ్యఁబోయెను. ఇట్లెన్నియో వ్యత్యస్త పుమాటల నాడుచుండ పాంథులావదరుల నాలకించి వీఁడు పిచ్చివాఁడని యనుకొనుచు తమత్రోవలం బోయిరి.

అచ్చటి కరుదెంచినవారిలో కొందఱాగనె లుండిరి. ఈ వృద్ధుఁడు తటాలునఁ జేకఱ్ఱ సహాయమున లేచి పరువిడి యొ కమానవతిని బట్టుకొనెను. ఆలేమ తన్నెన్నియో దుర్భాషల నాడినను వానినెల్లఁ బెడచెవినిడి యామెనీరీతిఁ బ్రతిమాలెను. "సుశీలా! యేటికిట్లు నన్ను గసరెదు? నేనిఁక సురఁద్రావను. రమ్మా, నాయొద్దఁ గూరుచుండుము. ఏదీ మన లలిత? ఒక

మూరా లలితనుజూపుము. నాపై కమంతయు నెందుఁబోయినది? అనాఁడు దాచఁమనియిచ్చిన లిబ్బి నిటుఁదెమ్ము. అదిగో! ఆవచ్చువారు నామిత్రులుగదా? నీవిందే యుండుము. వారితో నేనేగి కడుపారఁ ద్రావి యిపుడే యరుదెంచెదను. నీవెందును బోకు"మనెను. అట్లనుచు మఱల నాతఁడు బాటను బట్టిపోవు చుండెను. పాపము! పిచ్చివాఁడని దయఁదలఁచి యాదారినిఁ బోవు తెరువరులు వీని కేదేని సహాయమొనర్పఁ జాలిఁగొనిరి. వారీ వృద్ధు వెంటనంటియే వచ్చుచుండిరి సమీపమందే రాజ మహేంద్రవరముండెను. అది సుప్రసిద్ధములైన పట్టణములం దొక్కటి ఆకాశమునంటు మేడలు, చిత్రవిచిత్రములగు గోడలు విశాలములైన వీధులు 'గలిగి వాణిజ్యమున నతిశయించి యా పురము వెలసియుండెను. అందందు పుష్పబాలికలు పువ్వుల నమ్ముచుండిరి. వివిధ ఫలములు విక్రయింపబడుచుండెను. నానా విధముల వస్త్రవిక్రయములు నడచుచుండెను. ఆయున్మత్తుడు కేఁకలు వేయుచు రాజమార్గము వెంటనే వచ్చుచుండెను. పథికు లొక్కరును నిపుడా ముదుసలి వెంట లేరు. ఆయాసవివశుఁడై యావృద్ధుఁడొక మందిరపు ముంగిటి వేదికపైఁ గూలఁబడెను.

ఆమందిరాంతర్భవనమందొక మానిని మాత్రముండెను. వృద్ధుఁడు బయట కేఁకలిడ మొదలిడెను. ఆకంఠధ్వనివిని పదు నేడేండ్ల వయస్సుగల యొకజవ్వని బయటికరుదెంచెను. ముదు సలి అట్లే ప్రేలుచుండెను. ఆతనినిఁ జూడజూడ నాపెకన్నులను ండిసీసుగారఁజొచ్చెను. సహింపరాని దుఃఖభరమున "నాయనా!

తుదకిట్లైతివా" యని యామెవచ్చి యావృద్ధు చెంతఁగూరుచుండెను. ముదుసలి "నీవు మాలలితవా ?" యని ప్రశ్నించెను. "అవునునాయనా ! రమ్ము, లోపలికిఁబోవుదము." ఆమె యా ముదుసలిని లోనికిఁగొంపోయెను. పాఠకమహాశయులారా ! తండ్రిబిడ్డల సమావేశ మెవ్వరికి హర్షదాయకముగాకుండును?

---

## పంద్రెండవ ప్రకరణము

---

ఋతువులన్నిటిలో వసంతర్తువు ఋతురాజ మనఁబడుచున్నయది. ఆఋతువునం దెండలు మెండైనను నారామము లత్యంత రమణీయములై నయనోత్సవమును గొలుపుచుండును. లేఁత యఱటుల యున్నతియు, తమాలహింతాలముల యభివృద్ధియు, మాకందపు మ్రాకుల మనోహరతమును, పొన్న గున్నల యేపును' లతామతల్లికల యల్లికయు, వివిధ పుష్పములందలి సౌరభమును, మందమలయానిలుఁ డొసఁగు హాయియు, పతంగముల కూజితములును, యెవరికి మెప్పుగూర్పకుండును ? ఇట్టి వసంతర్తువు నందొకనాఁటి సాయంసమయమున కమలాపురరాజవీథులంబట్టి యిరువురు పురుషులొక యుద్యానవనాభిముఖులై వెడలుచుండిరి. చండకరుండయ్యును ప్రభాకరుఁ డపరశైల మలంకరించి యాసాయంసమయమునఁ జల్లని కిరణములఁ బ్రసరింపఁజేయుచుండెను. ఆయుద్యానవన

ము కమలాపురమునకు దక్షిణభాగమం దుండెను. వారా వనమున కేగి కొంతసే పందందుఁ బచారు సలిపిరి. తరువాత వారందలి లతాగృహసమీపమున చలువరాతితిన్నెపై నాసీనులైరి. ఆలతాభవనము మల్లెను తల్లికాదివల్లులచే నల్లిబిల్లిగా నల్లఁబడియుండెను. వికసించిన కుసుమములచే నొప్పిన యాలతామతల్లిక లందుఁ గూర్చుండిన పురుషులకావనమొక వింత సోయగముఁ జూపుచుండెను. పుష్పములు తమ కమ్మని వాసనల గమ్మగమ్మన వెదఁజల్లుచుండెను. మధుమక్షికలు జుమ్మ జుమ్మని రొదసేయుచు బూవుసారములానుచుండెను. వసంతకాలమగుటచే నాయుద్యానవనమందలి తరువులు చిగిర్చియుండెను. ఆ లేఁజిగురుటాకు లావనమున కొక యపూర్వ సౌందర్యమును గూర్చుచుండెను. శుకపికశారికాదులరవంబు లావనమందంతటఁ బ్రతిధ్వనులీనుచు కర్ణరసాయన మొనర్చుచుండెను. ఇట్టి సాయంసమయ రామణీయకమున కీయుపవనం బొకనింత శోభనొసంగుచున్న నందతిశయం బేమి? ఇంతటి సౌందర్యములతో నొప్పు నీయుద్యానవనము మనకు పరిచితుఁడైన హరిదాసు తండ్రి రమేశునిది. అందుఁ గూర్చుండిన పురుషులలో హరిదాసుతండ్రి రమేశుఁడొకఁడు. ద్వితీయుఁడాతని మిత్రుడు. ఆ మిత్రుఁడు రమేశునితో నిట్లు మాటాడసాగెను.

మి—మిత్రమా! హరిదాసు వివాహవిషయమై నీయాలోచనం బెట్లు?

ర—ఆలోచనం బేమి? షట్కర్మయం దారితేరినవెంటనే కల్యాణ మొనర్ప నెంచితి.

మి:—కన్య యెుచున్నది?

ర—నాపుత్రుఁడు శేముషీవంతుఁడు గావలయుఁగాని కన్యల కేమిగొదువ?

మి—ఈమాట విచిత్రముగా నున్నది. కొడుకులఁ గన్న వారు వయఃకాలమునుబట్టి మున్ముందుగనె కన్యక నేర్పఱచు కొందురు.

ర—అవునది సహజమే.

మి—ఐన నీవెట్టిప్రయత్నమును జేయకున్నావుగదా?

ర—ఇపుడు మించినదేమి? నేను కులీనుడను. హరిదాసు విద్యావంతుఁడు. అందును సౌందర్యవంతుఁడు. నేనెవరికన్య నడిగినను మావాని కాళ్లుగడిగి కన్నులకద్దుకొనియిత్తురని నా యభిమతము.

మి—ఈభారము నీవేల భరింపవలయు? వానినె త్తికే కట్టిపెట్టుము. తనయీడున కెనయగు విద్యావినయ సౌందర్యసం పన్నురాలినే కోరుకొననిమ్ము.

ర—నాకది యంతయిష్టముగాలేదు. వాని కన్నంతయు సోమనాథుని కూఁతునందున్నది, లలిత సద్గుణవతియే గాని, సోమనాథుఁడు తుంటరి, గర్వి, నీచుఁడు, త్రాగుబోతు. ఇట్టి వానితో వియ్యమొంద నామనసొప్పదు. అందువలన నేను వానికి స్వతంత్రత నీయనొల్లకున్నాను.

మి—సోమనాథుఁ డట్టివాఁడే యనుకొందము - పాపము లలిత యేమిచేసినది?

ర—లలిత మంచిదే. ఆపాపిచర్యల మూలమునే నా సంసారమునకు లలితను జేర్చుకొన నిచ్ఛగించకున్నవాఁడను.

మి—అయిన లలిత నింతటితో విడచినట్టేనా?

ర—అవును. ఆబంధుత్వమే పూర్తిగవదలుకొంటిని.

మి—లలిత నీకు మేనకోడలుకాదా? ఆమెపై నీకేల దయరాదు?

ర—కులకళంకమునకు నామానస మొర్వదు. ఈ విషయము నిఁక ప్రస్థాపింపకు.

మి—నీయందు నాకుఁ జనువుగలదు అనుకూలదాంపత్యమని నిన్ను మందలించినందులకు క్షమాపణ మడుగుచున్నాను.

ర—ఈ నిర్బంధమునకుఁ గారణమారయ హరిదాసుఁడు నీపాదములపైఁ బడియుండునని నాతో చెప్పెను. నిజమా?

మి—అట్లు జరుగలేదుగాని ప్రస్తావవశమున నీవివాహప్రశంస నేనే హరిదాసునితో హెచ్చరించితి. వాఁడాభారమంతయు నీపై నిడెనుగాని వాని యాంతరంగిక ప్రేమయంతయు లలితయందున్నట్టు ముఖభావము సూచించుచున్నది.

ర—అది ప్రమాదము. ఆ ప్రేమ నామెపై నిడుట హేయపాత్రము, దుఃఖభాజనము, కడునీచము. ఈవియ్యమువలదని వానితో గట్టిగ నొక్కి చెప్పుము.

వీరట్లు మాటాడుచుండ నొకసర్పము గేవగిపోవనుండి

మల్లెపొద కరుఁగుచుండెను. రమేశుఁడును నాతని మిత్రుఁడును దాని నాకస్మికముఁగా నవలోకించిరి. వీరు గూర్చుండినడి మల్లెపొదకు సమీపమగుటచే వారి మానసములు భీతిల్లినవి. ఆవ్యాళము మల్లెపొదను సమీపించుచుండెను. దానిఁగొట్ట నతిత్వరులై వారిరువురును దమచేతికఱ్ఱలతో నటకేగిరి.

హరిదాసుఁడు పొదలచాటున రమేశుని కంటఁబడెను. రమేశునిమిత్రుని మోమునందుఁ జిఱునవ్వంకురించెను. వీరి రాకఁగాంచి పాముదిముఖతఁజెంది మఱొండు పొదరింటికరిగెను. హరిదాసునుగాంచి రమేశుఁడు కోపతీవ్రసూచనాస్వరముతో "నీవిచటికెందులకేతెంచితివి?" అని ప్రశ్నించెను. హరిదాసు మోము వివర్ణతగాంచెను. పెదవు లదరెను. నాలుకతడవడెను. శరీరముకంపించెను. ఈయవస్థల నన్నిటి నడఁచుకొని "తండ్రీ! వాయుసేవనమున కరుదెంచితి"నని నెను.

ర—అయిన నీపొదరింట నేలడాఁగితివి?

హ—నీకంట నేల పడవలె నని.

ర—కాదుకాదు. లలితనుగూర్చి విననతికుతూహలుఁడవై కాఁబోలు వచ్చితివి

హ—మీసంభాషణమును నే విన లేదు.

ర—నీయుద్దేశమింకను మార్చుకొనలేదా

హరిదాసు తండ్రియాజ్ఞల నుల్లంఘింపనెల్లనివాఁడు గాన మౌనముద్రవహించి నిలుచుండియుండెను.

ర—నీ మాటలు నేనమ్మను. నీ హితముఁగోరి నీకుపదేశించు నావాక్యములు నీకుఁ గష్టముగా దోఁచుచున్నవి. నీమేలునే నేఁగోరుచుంటినని నీవు దెలియవైతివి. నయమున నెంత జెప్పినను నీబుద్ధి మాఱునట్లుఁ గాన్పింపదు. వయోరూపగుణంబుల నామెనుమించిన సుందరీమణులెందఱో నీపాదములపైఁ బడి నిన్ను వేఁడుకొనవలయుననియుండ వారిపై నీయనిష్టమును జూపుచున్నావు. ఇఁకనైన నీవా ప్రేమను మానుకొనవలయును. ఏమిచెప్పెదువు?

హ—(దీనస్వరమున) నేనింకను జదువవలెఁగాన దామిప్పుడే వివాహవిషయముల నాతో నాలోచింపకుండురని వేఁడెద.

కుమారుని ప్రతివచనములవిని రమేశుఁడును, నాతని మిత్రుఁడును తిరుగ నాప్రశంస ముచ్చటింపక కొంతసేపటి కాస్థలముఁ బాసిపోయిరి. హరిదాసుముఖమున దుఃఖము తాండవమాడుచుండెను. అతఁడొంటరిగ గూరుచుండి యిట్లనుకొనఁదొడఁగెను. "మాతండ్రి మఱియొక కన్యను బెండ్లిసేయ నెంచినాఁడని నాప్రాణనాయికకు నేనెట్లు తెలుపుదు? అయ్యో! లలిత నెట్లు మఱువగలను? ఆప్రేమ నెట్లుమానగలను? తండ్రి మాయన్యోన్యానురాగంబుల ద్రెంచనున్నాఁడు. నేనొకవేళ నతని యాజ్ఞ మీఱనొల్లక మఱొకకన్యను బెండ్లియాడిన, లలిత నన్ను నిర్దయుఁడని దూషింపదా? కఠినహృదయుఁడని నిందింపదా? నీవు నన్ను వివాహమాడకున్న సన్యాసత్వ మవలంబింతునని ప్రతిజ్ఞఁబట్టియుంటిఁగదా! ఆమాట లేమవును? దైవ

మేల మాకిట్టి యన్యోన్యమైత్రి నొడగూర్పవలయు? మాతండ్రి మూలమున నిదియేల భగ్నముగావలయును? ఇఁక లలితదర్శనముగూడ నాకు లభించుట దుర్లభము. నేనిన్నిదినములు దలఁచిన తలఁపులన్నియు నేటితో ముగిసిపోయినవి.

"నాకోరిక యిఁక నెన్నటికి నీడేరదు. లలితను వివాహమాడుదునన్న యాశ నన్ను పూర్ణముగా వీడిపోయినది. కాని నాబహిఃప్రాణమగు లలితకుఁ గలకాలము తీఱనిదుఃఖముఁ గలిగించితినని నామానసము వ్యాకులతఁ జెందుచున్నది. దైవమా! నేనిన్ని యిడుమలఁగుడుచుట కెంత దౌర్భాగ్యశాలనను! నీ సంపూర్ణకృపావిశేషములకై యింకను గొంతకాలమిట్లె నిన్ను స్మరించుచుందును. తుదకు విషయవిఫలతయే సంభవించిన నాకును లలితవోలె విదేశమే శరణ్యమగును గాత" మని చింతించి చింతించి నిజగృహమున కరిగెను.

---

# పదునాల్గవ ప్రకరణము

---

వెనుకటి ప్రకరణములందు లలిత విద్యావతియని వినియుంటిమి. కడచిన ప్రకరణమునందు వసంతుని దక్షిణ భుజమును తన భల్లమున కాహుతిఁగొని హరిదాసు వెంటనరిగిన భిక్షుకుఁడే లలితయని మాచదువరు లెఱిఁగియుండవచ్చును.

భిక్షుకవేషమును వీడి హరిదాసునొద్ద నుండుటకు లలిత క్లిష్ట మేగాని, రమేశుఁడు సోమనాథుని కుటుంబము నీచమైనదని భావించి, హరిదాసును కట్టుదిట్టములం దుంచుటచే యామె కమలాపురంమందుండుటకు వసతిఁ గనదయ్యెను. హరిదాసు ప్రేమ లలితయం దత్యధికముగా నుండినను దనతండ్రి కట్టు బాటులకుఁజిక్కి చేయునది లేక యాతఁడు తనయాప్తమిత్రున కొక లేఖవ్రాసి లలితను రాజమహేంద్రవరమున కనిపెను. ఆ కమ్మయందలి ప్రభావమెట్టిదోకాని కులీనుఁడగు హరిదాసుని యాప్తమిత్రుఁడు లలిత నొక బాలికాపాఠశాలయందు జీతము నకుఁ గుదిర్చెను. ఆమె యొక్క ప్రాథమిక పాఠశాలయందుఁ బ్రధానోపాధ్యాయిని యయ్యెను. ఆమె తన సహాధ్యాయినులతో నైకమత్యమును కలిగి మెలఁగుచు మిక్కిలి పట్టుదలతోఁ బాఠశాలాకృత్యములను జక్కపఱుచుచుండెను.

సంగీతమునం దామె కఖండపాండిత్యము గలదు. చిత్ర లేఖనా వైఖరియందామె కడునిపుణురాలు. లోకవిజ్ఞానశాస్త్ర మలవరించి బాలికలకు మించినశక్తి నావహింపజేయుటయం దామె యెక్కుడు నేర్పరి. ఇప్పటి పాఠశాలలం దుపాధ్యాయులును, నుపాధ్యాయినులును, నామె వాచక పాఠమును బోధించుచుండినదిచూచిన "నీమె యింతటి శక్తిసంపన్నయా" అని యనుకొనక మానరు. మనోగణితమందేమి, గణితపాఠమునందేమి బాలిక లెక్కుడు జ్ఞానమందవలయునన్న నామెయొద్దనే చదివితీరవలయును.

ఇంత యేల! ఆమెయున్న పాఠశాలయందు కావ్యరచనలకు

ప్రోత్సాహ మొసగునది లలిత. వ్యాకరణవిషయములకు వన్నె బెట్టి నేర్పునది లలిత. దేశచరిత్రము లుపన్యసించుటయందు ధీరాగ్రగణ్య లలిత. ఖగోళశాస్త్రమందు గణ్యతఁగాంచినది లలిత. భూగోళశాస్త్రమునఁ బూజ్యత వహించినది లలిత. రకరకపు పూసలతో నతిరమ్యముగా దట్టలపై పుష్పము లమర్చుటయందతినిపుణతఁ గాంచినది లలిత. కడు సొబగుగ హంసలు నృత్యము సేయునటుల నున్నిదారముచే వస్త్రములల్లుటయందు వన్నెకెక్కినది లలిత. బీదబాలికలకు వృత్తి విద్యయే జీవనాధారమని కుట్టుపనులు సూచించుటయందుఁ బేరుగాంచినది లలిత. వేయేల! మూఢమతులను విజ్ఞానవంతులుగఁ జేయనవతరించిన వాగ్దేవియే యీమెయనఁ జాలదా

ఇట్లీమె విద్యావిచక్షణురాలై బాలికామణులకు నాఁడు నాఁటికి సంతోషముఁ గూర్చుచు తనపై యుద్యోగీయుల కెంతయో మెప్పుఁజూపుచు నెల్లవారి కానంద మొసంగుచు వర్థిల్లుచుండెను.

అమృతలతయందు విషముష్టి యంకురించినభాతి లలిత గుణములు సోమనాథునకు గిట్టకుండెను. సోమనాథునకు లలితను గాంచినవెంటనే సగము వెఱ్ఱి వదలిపోయెను. అనుదినము లలితచేయు శుశ్రూషలవలనను, భైషజకర్మ చాతురీధురీణులగు వెజ్జులొసఁగు మంచి యౌషధపు సేవనమువలనను, వెఱ్ఱియంతయుఁబోయి దినదినారోగ్యాభివృద్ధిని గాంచి యిపుడీతఁడు న్యాయవాదియై విరాజిల్లుచుండెను. అతఁ డనుదినమును న్యాయస్థానమున కేగుచుండెను. లలితయంది

రపు ముంగిలిచావిడియందు కక్షిదారులు లేనిదినమే యఱుఁగు. వైజ్య పురుషులవల్ల సోమనాథుఁ డెక్కుడు ధనమును సేకరించుచుండెను. లలిత వ్యర్థవ్యయములను జేయునది కాదు. ఆమెకూడ ధనసంపాదనా కుతూహలయే. ముందటివలెనే తండ్రితోడి యానందమిప్పుడు లభించినదని యామె యించుక సంతసింపఁజొచ్చెను. కాని పాపము! తన సోదరులగు రాజవాహన రత్నాకరుల స్థితిగతులఁ దెలియమికి నొక్కొక్కమాఱు దుఃఖపడుచుండెను. కూడుగుడ్డలకు నలుగక యుదర పోషణము సుఖముగఁ జరుగుచున్నదను సంతోషమె యామెకప్పుడప్పుడు జనించుచుండెదిగాని తన మానసమునందు విడువక హత్తుకొనియుండెడి హరిదాసుపైఁగల తన యనుపమానమైన ప్రేమాంతరంగములుఁ గమ్మి నపుడు దిక్కుఁదోపక నిట్టూర్పులు నిగుడ్చుచుఁ దనలోఁదాను గుందుచుండెడిది. హరిదాసునందుగల సుప్రతిష్ఠితమగు తన ప్రేమమున కెన్ని యంతరాయములో గలిగినను వానినన్నింటిని సరకు గొనక సంతోషాంతరంగముతో మెలఁగుచుండెను. ఇపుడామె తండ్రివలన నొకవిపత్తునఁజిక్కి తత్తరించుచున్నది. ఏమందురా?

రఘునాథుఁడను నొకయుద్యోగి న్యాయస్థానమందు సోమనాథునకుఁ బరిచితుఁడై యుండెను. అనుదినమును సోమనాథుఁ డతనియొద్దకేగుచుండెడివాఁడు. అతఁడు దండనాథునకు సచివుఁడుగా నుండెను. రఘునాథుఁడు రాజకార్యములందతివిచక్షణుఁడగుటచే దండనాథుఁ డాతనియందుఁ గడు కరుణఁ జూపుచుండెను. నాయకుఁడు రఘునాథునిచేతి సాల

భంజకంబుమాడ్కి నుండుటచే రాజకార్య రహస్యములు రఘునాథున కెప్పటి కప్పుడే తెలియుచుండెను.

సోమనాథునకును, రఘునాథునకును మిక్కుటమగు చెలిమి యలవడుటచే న్యాయస్థానమునందు సోమనాథుఁడు దెచ్చిన వ్యాజ్యములన్నియును జయముఁగాంచుచుండెను. రఘునాథుని యంతరంగ మెట్లున్నదో బయటికిఁదోఁపదు గాని సోమనాథునందుమాత్ర మతఁడు కడుప్రీతినిఁ గనఁబఱచుచుండెను. రఘునాథుఁడు సోమనాథునకు కక్షిదారులనుండి లంచము లిప్పించుటఁదప్ప వేఱొండు సహాయం బెద్దియు జేసినట్లు గాన్పించదు. సోమనాథుఁ డొకానొకదినమందు రఘునాథుని వెంట నిడికొని తనమందిరమునకు వచ్చెను. ఒక చిన్న గదియందు లలిత యిరువురు బాలికలకుఁ బాటల నేర్పుచుండెను. అపుడు సాంధ్యసమయము. బాలికలు కాంభోజిరాగము నాలాపించు చుండిరి. వారపుడపుడు రాగచ్ఛాయలను వీడుచుండిరి. లలిత తప్పులను సవరించుచుండెను. లలితగాని, బాలికలుగాని సోమనాథ రఘునాథులకు గాన్పించుటలేదు. వారు ముంగలిసోఫాలపై నాసీనులై యుండిరి. రఘునాథుని మనస్సంతయును. లలిత తప్పులు దిద్దుటను గాంచుటయందే పనిజేయుచుండెను. ఆమెయే యారాగము నాలాపించిన బాగుండునని యతఁ డనుకొనుచుండెను. లలిత దిద్దినతప్పులు బాలికలకు బోధపడుటలేదు. రాగము నొకమారాలాపింపుమని వారామెను వేడుకొనిరి. లలిత వీణనెత్తుకొన్నది. శ్రుతి సవరించినది. పాడఁజొచ్చినది. ఆహా! ఆశ్చర్యము. ఏమి! యాకంఠమునుండి వెడలు మధుర

ధ్వని! ఆగానమాధుర్యమును విని, కోయిలలు కూయవెర చెను. చిలుకలు పలుకుట మానెను. బాలికలకు మాంద్యము వీడెను. రఘునాథునకు వీనులవిందుగా నుండెను. అంత నతఁడు సంతోషాంబుధి మునింగి సోమనాథునితో నిట్లనెను.

ర—అయ్యా! ఆపాటపాడువా రెవరు?

సో—ఇంతవఱకు మీకుఁ దెలియదా? ఈమె నాకూఁతురు.

ర—వివాహితయా?

సో—వరనిశ్చయ మింకను లేదు.

ర—వయసెంత?

సో—ఇప్పటికి బదునేడేండ్లు.

ర—సరియైనవరుఁడు దొరకమి నిట్లుంచియుందురని తోఁచెడిని.

సో—లేదు. నే నాభారమంతయు నామెపైననే విడిచితిని.

ర—ఇప్పటి కామె యెవరినైన వరించినదా?

సో—అట్లేమియు జరిగినట్లు నాకుఁ దోఁచదు.

ర—అయిన నామెను నేఁజూచుట కిచ్ఛగింతురా?

సో—మీ కామెను బెండ్లియాడవలెనని కోరికయా?

ర—(ఇష్టమును సూచించి) నే నింకను నవివాహితుఁడను.

సో—అయిన మాలలిత నిందు బిలతునా?

రఘునాథుఁ డిపుడూరకుండెను. లలితను జూడఁగల్గుదు నను నానంద మాతనిహృదయమునందుఁ బొంగి పొరలుచుం

డెను. రఘునాథుఁడు తనయుద్యోగము నుగ్గడించి చెప్పిన లలిత తప్పక తన్నువరించునని యనుకొనెను. ఎట్లుఁయినను సోమనాథుఁడు లలితను తనకుఁ గూర్చునని యానందపడఁజొచ్చెను. ఇంతలో సోమనాథుఁడు "లలితాంబా! యిటురమ్మ" అనెను. లలిత తండ్రీ! ఇదిగో వచ్చితినని తనచేతియందున్నవీణ నందే యుంచి యాతని చెంత కరిగెను. ఆహా! అప్పటి లలితసొబగును మాటలతోఁ దెలుప నెవరితరము? స్వయముగఁ గాంచినఁగాని యాయన్నులమిన్న సౌందర్య మిట్టిదని తెలియఁబోదు. ఆలలితాంగి మైచాయ స్వచ్ఛందమైన ధావళ్యమునుగలిగి మిగుల సుందరముగా నొప్పుచుండెను. కోమలి తన విసీలకోమల చికురజాలములను జడగానల్లి కొన నంచొక పట్టుపీలికనుగట్టి వెన్నునఁ బ్రేలాఁడవిడిచియుండెను. విరిబోఁణి విశాలవిలోల లోచనములు, ధనురాకారముగా మలఁచిన నీలంపు భ్రూలతలు, ఆమె వాలారుచూపులును, ఆపద్మముఖివిశాలఫాలతలమున నున్న యర్ధచంద్రతిలకమును ఆమెమోమున కెక్కుడు శశనిచ్చుచుండెను. ఆసుందరీమణి విశేషాభరణసుశోభితకాదు గాని, తగుమైన పొడవుఁగలిగి పలుచని నెన్నడుముతో విద్యుల్లతావిగ్రహమో యనఁ బ్రకాశించుచుండెను. ఇట్టి సౌందర్యరాసి యగు లలిత యానాఁడు మిగుల స్వచ్ఛమైన తెల్లని చలువమడి లినుచీరనుగట్టియుండెను. ఆమెకర్ణములందలి వజ్రతాటంకములును, హరిదాసుచే నానవాలుగా నియ్యఁబడిన ముద్దుటుంగరమును, జడయందు కుచ్చుగాఁగూర్చిన మల్లెపూదండయు నామెకప్ప

టికెంతో బాగుగా నుండెను. రఘునాథుఁడామెనుగాంచి నంతనె తనకన్నుల విశ్వసింపక సోఫాపై గూర్చుండబెట్టినచిత్తరపు ప్రతిమ వలె నిశ్చేష్టితుఁడయ్యెను. ఇట్లు గాంచిన రఘునాథుని దృష్టులు వాని యద్భుతానంద సరసిని ముంచివైచెను. అతఁడా సౌందర్యవల్లో కనమునఁ బరవశుఁడైయుండ, సోమనాథుఁడు లలితతో నిట్లనెను. "అమ్మా! ఈరఘునాథబాబు దండనాథునకు నమాత్యుఁడుగా నున్నాఁడు. ఇంకను నీవలెనే యవివాహితుఁడు. కాన నితని వరియింప నీకిష్టమా?" యనెను. అనిష్టభావమున లలిత ముఖవికారమును జూపించెను. తిరస్కార వీక్షణములను నామె తండ్రిపైఁబఱపించెను. ఎట్టులయిన, నచ్చోటు వీడిపోవలయునని తత్తఱించెను. ప్రత్యుత్తరంబియ్యక యేగిన గౌరవభంగమని యోజించెను. తండ్రీ! యిటురమ్మని సంబోధించిగదిలో నికేగెను. అయిరువురు రందేమి మాటాడిరో గాని సోమనాథుఁడు బయట కరుదెంచి యీవిషయమును గూర్చి వేఱొకమారు ప్రస్తావించుట మంచిదని రఘునాథునితో బయటకు వెడలిపోయెను.

---

# పదునైదవ ప్రకరణము

---

ఏడవప్రకరణమునందు సముద్రమధ్యమున రక్షకతరణులయందుఁ ద్రోయఁబడిన యారాజ వాహనరత్నాకరులుగాలితాఁకున పడవయఱిగినజల్లనుబోయి పోయి కేపు కాలనిరా

జ్యపు సముద్రపు టొడ్డున నొక సైకత స్థలమునఁ ద్రోయఁబడిరి. అకస్మాత్తుగ నేతెంచిన పడవయందలి ప్రజలనుగాంచి నీటి యాపదఁజిక్కిన దీనులని దయఁదలఁచి కడు వేగమున కేపుకాల నినివాసులు కొందఱు వారల కరుదెంచి పడవయందుండిన రాజ వాహన రత్నాకరులతో నిట్లు సంభాషింపఁ దొడఁగిరి.

కాలసీలు—అన్నలారా! పడవ నిఃపమలబడిన మీరెవరు?

రాజవాహన—మేము భారతీయులము.

కా—మీరిచ్చినయుత్తర మెంతో గౌరవనీయమైనది గాని మిమ్ముఁజూడ నెద్దియో యొకగొప్పయాపదం జిక్కి దైవవశ మున నిట్లువచ్చితిరని మాకుఁ దోఁచుచున్నది.

రా—అయ్యలారా! అట్లే యనుకొనుడు, కాని యీపూఁట మమ్ము నాదరించువారిం దెవ్వరును లేరా?

కా—ఈపూట మీకాతిథ్య మిచ్చినపిదప మీ రెంద రిగాదదు!

రా—ఎం దరుగుటకు మేమింకను నిశ్చయించుకొన్న వార ముగాము. అనుకూలమైనచో నిచ్చటనే నివసింపఁజూచెదము.

కా—మీరెచ్చటనుండి వచ్చుట?

రా—హిందూదేశమునుండి.

కా—ఎచ్చటికి బోనుంటిరి?

రా—నేటాలు రాజ్యమునకు.

కా—మీరిప్పుడది దాఁటియే వచ్చితిరి.

రా—అయిన నిదియే దేశము?

కా—కాలనీలరాజ్యము.

రా—ఈరాజ్యమున వృత్తివిశేషమేమి?

కా—కాఫీ, తేయాకుతోటలు మెండు. మీరు సేద్యము చేయఁగలరా?

రా—మేము కర్షకులముగాముగాని కూలీలను గుఱించి లెక్కపత్రములను వ్రాయగలము.

కా—అట్లయిన చెన్నపురియందలి మా కంగాణిగారియనుమతికమ్మ మీయొద్దనున్నదా?

రా—కాలనీలకు, నాయనకు సంబంధమా?

కా—ఆయన యనుమతికమ్మను గాంచినగాని విదేశీయుల క్రిందఁ గాపురములు చొరుకపు.

రా—అయిన నపత్రమును జూడుఁడు?

కాలనీనివాసులు కంగాణి యనుమతికమ్మను గాంచిరి. రాజవాహన రత్నాకరులకు కాఫీతోటలందలి కూలీలను విచారించు నుద్యోగము లియ్యఁబడెను. ఆరంభమున వారికిఁ గొంతవఱకు సుఖముగనే యుండెను. కాని, కొంతకాలమైన పిమ్మట రాజవాహనుఁడు, రత్నాకరుఁడును బ్రత్యేకింపఁబడిరి. ఇప్పు డన్నదమ్ము లిరువురును వేర్వేరు దేశమునం

దున్నారు. వీరిస్థితిగతులు మాఱిపోయినవి. ఒంటరిగనుండినను కడుపు కూటికొఱకై కాలనీలు చెప్పినట్లెల్లను బనిచేయు చుండిరి. రానురాను కాలనీలు వీరిని గడునీచముగాఁ జూడఁ జొచ్చిరి. వీరు చేయుటనికి నియమము లేదు. చేసినపనికన్నో వేతనము లందుట యరుదు. కాలనీ లిచ్చుజీతము లొక్కొక్కతెఱి కన్నపుకూటికే చాలకుండెను. కేపుకాలనీలకొలువు పాప మాబీదబాలురకు కడుభారముగ నుండెను. ఏమిచేయఁ గలరు? కష్టనష్టములఁ కొడిగట్టుచున్నయుండిరి. చీవాట్లను సైరించుచునే యుండిరి. ఎక్కుడు నోర్పును వహించియుండిరి. ఒక్కతరుణమున నాయన్నదమ్ము లిరువు రేకస్థలమునఁ జేరుట తటస్థించెను. ఒకరికష్టము లొకరితో నిట్లుఁ జెప్పుకొనసాగిరి.

"అన్నా! నాబ్రతుకు కడుభారమైనది. ఇఁక నేనిందుం డిన కాలనిలవారిచేఁజచ్చుట నిక్కువ"మని రత్నాకరుండన, "తమ్ముడా' ఆరంభమునుండి నాన యదృష్టమేక్షీణరాసి నను సరించినది. కాలనీలచే నాకొదవిన కష్టములు చెప్ప లేకున్న వాడను. ఇపుడిపుడు నాకొకయోజన పొడముచున్నది. పట్టపరీక్షయందు దాటిననొకన్యాయవాది యుండుఁగలడు. వీరి బారిఁబడిక యెటులైనను మనమువారికడ కేగిన మనకష్టములు గడతేరునని తోఁచుచున్నది.

ఇట్లనుకొని' వారివలెనే కష్టపడుచున్న కొందరితోఁ గలసి, వారందఱును ఆన్యాయవాదియొద్ద కేగిరి న్యాయవాది కరుణా కటాక్షవీక్షణములతో వారినాదరించి వారినందుండి విడిపించి, తిరుగ తమదేశములు చేరునట్లు చేసెను.

# పదునాఱవ ప్రకరణము

చదువరులకుఁ బరిచితుఁడైన యొకజవ్వనుఁడు ద్విచక్ర యుతంబగు నొకత్రొక్కుడుబండిపై రాజమహేంద్రవరము నకుఁ బ్రయాణము సేయుచుండెను. అక్కాలమునందు ధూమ శకటము లుండియు నీయెమ్మెకాఁడు త్రొక్కుఁడుబండిపైఁ బ్రయాణముఁ జేయుటనుజూడ నితనికి రైలుబండి తప్పియుం డునని తోఁచుచున్నది. బండి పోవువేగమును గాంచిన నతఁ డెద్దియో యొకఘనకార్యమును నిర్వహింపఁబోవునట్లుఁ జూప ఱకుఁ దోఁపకమానదు. అపుడపుడే బాలభాస్కరుండు తన శాంతకిరణములకుఁ బదును పెట్టుచుండుటచే నది ప్రథమ యామాంత్యమై యుండునని యూహింపవచ్చును. ఆ యావ నుని రుధిరహీనమైనమోము, తేలవేయఁబడిన కన్నులును, శ్రమవారి సహితమగు లలాటఫలకము, నాసికారంధ్రముల నుండి వెడలెడు నుచ్ఛ్వాస నిశ్వాసముల యాధిక్యమును, జిహ్వాగ్రహమునఁ దడిలేక మాటల తొట్రుపాటుఁ జూపుచు నెండియుండెడి పెదవులును, దగఁగొని కళమారుటచేఁ గలిగిన హీనమైన కంఠస్వరముఁ, గాంచిన నతఁడెద్దియో యొకగొప్ప సంకటమునఁ జిక్కెనని దారినడచు యధ్వగు లనుమానింపక మానరు. యువకుఁడుమాత్ర మెదురుపడ్డపథికులతోఁ మాటా డక తనరథవేగమునకు దారివిడువ యంత్రసంబంధమగు నొక

ఘంటానాదముచే వారికిఁ దనరాకఁ దెలుపుచు త్వరగతి నరుగుచుండెను. ఇట్లరుగ వాఁడకస్మాత్తుగ నొకచల్లని నీడనెసఁగు చెట్టుక్రింద నించుక యాగెను. ఇతని రథవేగముగని వెనుకకుఁ దిరిగిచూచు పథికులతఁడు దాహబాధ నివారింప నూఁతిచెంత కరుగునుగాఁబోలుననుకొనిరి. గాని, యతఁడట్లొనర్పక తన యంగరకాయందు నొకలేఖనుదీసి తనలోఁ దాఁ జదువుకొన సాగెను. అందిట్లుండెను.

"ఇప్పటికి నేఁ గుశలము. క్షణక్షణమునకు మీక్షేమ మారయుదాన. ప్రాణప్రియుఁడా! ఆరంభమున విశాలసమతలమందు నికుంజపుంజలతా భవనసమీపమున సర్పదష్టనై పడియుండిననాఁడు, మన్యసీమ ఘోరాటవీమధ్యభూముల భిలులచేఁజిక్కి హాహాకారంబునఁ దత్తఱిల్లిననాఁడు సోదరీమరణ శోకమున సుఖముమఱచి క్రుస్కిననాఁడు, ఉన్మత్తుఁడగు పితృవ్యుని వియోగదుఃఖమందుఁ బొల్గొన్ననాఁడు, అశనవసనములు దొఱకు టరిదియై యనుజన్ములు విదేశముల కేగిన నాఁడు, కోఁడెగాండ్రబారిఁబడి గ్రుక్కుమిక్కు రనఁజాలక పురభ్రష్టనైననాఁడు క్షుధానలంబుచేఁ గమలాపురవీథులం దింటింట భిక్షమెత్తిననాఁడు, దుర్గమవనసీమల నీవు శత్రుకరవాలమున కెరయగుదువని గుండెలవిసి భీతిల్లిననాఁడుగూడ నేనింతటి యార్భాటము ననుభవించినదానను గాను. ప్రాణప్రియుఁడా! జనకుఁడు నాచెంతజేరినపిదప వెనుకటి కష్టములు మఱచి యించుక సంతోషమున మనుచుంటిని గాని నాయదృష్టవశమునను. తండ్రిమూలమునను నేనొక పరిభవాన

లంబున కొంకశలభముగా నున్నదాన. శాంత స్వభావము, వినయవిధేయత సమధికా గౌరవము, విద్యాధురీణత, పరోప కారపారీణత, సత్యసంధత, మితభాషణము మున్నగు గుణముల కాకరమని లోకముచేఁ బొగడ్తఁగొన్న యొకయనాథ, యొక యబల, యొకయసహాయయగు సాధ్వి రక్షకభటులచేఁ జిక్కి కారాగారబంధదుఃఖ మనుభవింప దారిఁ జూచుచున్నది. తరుణమున సర్వోత్కృష్టమగు మానరక్షణ మొనర్పు సహాయు లరుదు. కరుణింపుము. నన్ను మన్నింపుము. ఆత్మబంధూ! తుదవిధాన మిదియ. సమయమునకు నీవురాక, అదరించు వారు నాకులేక, రక్షకభటులు పెట్టెడికష్టములఁ దాళఁజాలక యున్నపుడు, సరసియో, ఉరియో, గరళమో, యగ్నియో, శరణమగుఁగాక."

రాజమహేంద్రవరము. }
12—7—1908, } ఇట్లు
దీనయగు లలిత,

ప్రయాణముచేసిన యువకునిమోమిపుడు మఱింత వాడి యించుకేనియు రక్తములేక వైవర్ణ్య మావహించెను. ఎంత వాడిననేమి? అతని భ్రూయుగ్మము సుడివడి ఆగ్రహ దృష్టులను సూచించుచుండెను. ఒక్కింతనే యాయాగ్రహము మాఱి శోకస్వరూపమును గాన్పింప జేయుచుండెను. ధీరుఁడ య్యును నేలోకోగాని యాతని నేత్రములనుండి యుష్ణబాష్ప ములు జటజటఁ గారుచుండెను. అయ్యది యాతని దయార్ద్ర హృదయమును జాటుచుండెన్ను, ఇట్టి దురవస్థలందుఁ జిక్కియు

నాతఁడు తనకరంబులను శిరంబుపై నునిచిఁ దీర్ఘాలోచనము చేయసాగెను ఏమనుకొనెనో కాని యాతఁడు రబ్బరుబండిపైఁ గూరుచుండి, చూపఱులకుఁ తన గమనవేగమును జూపసాగెను. కొన్ని నిమిషములకాలములోనే రాజమహేంద్రవరముఁ జేరెను. ఆపురవరంబున నితఁడెవరింటికేఁగవలయునో యెవ్వరికిని దెలిసినదికాదు. ఆధీరుఁ డొకరాజమార్గమునుబట్టి పోవుచు, నావీధియందు "సోమనాథునిమందిర మున్నదా? అట్లైన నదియెచ్చట నున్నది, దయయుంచి చూపెదరా?" యని యొక్కొక్కరిని నడుగుచుఁ బోవుచుండెను. పురవాస్తవ్యులు చూపిన యొక మందిరమును గాంచినవెంటనే యిదియా, మాలలితమందిర మని లోనికేగెను. లలిత సోపానముపైఁ బరుండి కన్నుల నీరు నించినట్లుండెను. ఆమె యువకునిగాంచి తటాలున లేచి "నేఁటికి నాకష్టము లంతరించినవి. మీ రరుదెంచుట నా భాగ్యము." అనెను. లలిత యింక నొకమాటయైనను నాడఁజాలక పోయెను. ఆమె హృదయాంతర్గతమం దంకురించిన శోకవేగ మంతకంతకుఁ బైకుబకఁ జొచ్చెను. పాపము! కరవస్త్రము ముఖముపైఁ గప్పికొని యామె గోడుగోడున నేడువసాగెను. యువకుఁడు సహజధీరుఁడు అతనిమానస మించుకేనియుఁ జలింపలేదు. లలితను సజీవనుగా గాంచినతోడనే యాతనిప్రయాణపుఁబడలిక లన్నియు నడుగంటినవి. వానిముఖపద్మము వికసించినది. నూతనకళ లావిర్భవించినవి. మానసము స్తిమితస్థితి నొందినది. అతఁడిపుడు లలితమోము నెగాదిగఁ దిలకించెను. శోకవేగము ననుసరించిన యామోమునం దేమివింతఁ గాంచెనో, యావింతయెం

ఆటిసంతోషతరంగముల కిక్క-యోకాని తక్షణ మా యువ కునిమోమునందు మందహాసచంద్రికలు వెనువెంటనే నృత్య మాడ నతఁడపు డిట్లనెను. "నే నరుదెంచుట భాగ్యమంటివే! ఇం కను నేడ్చెద వేల?"

ఈతరుణమున లలిత యించుక లజ్జనొందెను. అధో ముఖియై నేల గీయనారంభించెను. ప్రత్యుత్తర మియ్యఁబ్రయ త్నపడుచుండెను. కాని గొంతు డగ్గుత్తికపడినది. ధారాళముగా మాట వెలువడుట లేదు. మాటాడ గొంతును సవరించుచున్నది. అతికష్టముతో నామె యిట్లనెను.

ల—రాబోవు దుర్యశమునకై

యు—అందుకు నే నుందుఁగదా?

ల—దుష్కీర్తియందు నేనును సమభాగినినే.

యు—అనుభవించెడి కష్టమిరువురకు సమానమేయైన నది నాకానందభాజనమే.

ల—నాయొక్క ప్రాణమునకైకదా, మీకింతటికష్టము.

యు—ప్రేయసీ! నే నతిథిని వాతిథ్యమియ్యనున్నదానవు. మాటలయుపచార మింక యేల? ఉదంత మెద్దియోవచిం పుము.

ల—హీనవిషయమని కోపింపక నన్ను మన్నింతురా?

యు—నిన్ను మన్నించుటయా! ఆనాఁడరణ్యమున మన యిరువురి ప్రథమసమావేశసమయముననే విన్నవించితిఁగదా!

ల—అంతటి గొప్పమాటలేల? నాఁటికిని నేఁటికిని నేను మీ చరణదాసినే.

యు—నీ వినయమతిస్తోత్రపాత్రము. తటస్థించిన విపర్యాసమునకుఁ గారణమెట్లు?

ల—మాతండ్రి మూలమునఁ

యు—విన నాతురుఁడ,

ల—చెప్పుటకు గన్నతండ్రి. చెప్పుకొనమన్న నారడికి పాలగుదునేమోయని జంకెద. అతనివెఱ్ఱిని బాగుచేయించితి. అమితశుశ్రూషలచే నాతనిమానసమును స్థిమితరాశికిఁదెచ్చితి. పుత్రిపైఁ గడువాత్సల్యత జూపుచుండెను. వెనుకటి దుర్గుణములు వీడెనని నమ్మితిని. అతఁడిపుడు న్యాయస్థానమందు న్యాయవాదియై యున్నవాఁడు.

ఇపుడు న్యాయాధ్యక్షునకు రఘునాథుఁడను నమాత్యుఁడొండుగలఁడు. తండ్రి యాతనితో మిక్కుటమగు చెలిమినిఁ బెంచెను. తుదకు నన్నాతనికిఁ గట్టనుంకించెను. నే నొల్లనంటిని. తండ్రి పట్టినపట్టు వీడక నను బాధించెను. గొప్పయుద్యోగియని బెదరించెను. నన్నష్టకష్టముల పాల్సేతునని భయపెట్టెను. నన్నంతగాఁ బట్టుపఱచఁజూచినను, నేధైర్యము వీడకుంటిని. ఆయన మాట కాదంటిని. కష్టములకు వెరవనంటిని. తండ్రియాజ్ఞనతిక్రమింపఁగంటిని. తండ్రి మందిరము తనదనియె. నాకేమియు నీయననియె. నన్నిల్లు వెడలిపొమ్మనియె. నేఁ బోనంటిని. విజయనగరమునందలి సొత్తునంతయు నపహరించితినని నాపై నొకయభి

యోగమును దెచ్చియున్నవాఁడు. నేఁడు నేను న్యాయస్థానము నకుఁ బోకుండిన విధిలేదు. న్యాయస్థాన మెక్కుట కడునీచమని నాబుద్ధి ప్రబోధించుచున్నది. అది యెక్కు డవమానకరమని మానసము చలించుచున్నది. నేఁ డీబన్నమునుండి నన్నుఁదప్పింపుము. ఈదుర్యశమునుండి నన్నుద్ధరింపుము. న్యాయస్థానము నకుఁ బోకుండుదారిని నాకుఁ గటాక్షింపుము. నీమానసమున వేఱు దలఁపక నను మన్నింపుము.

యువకుని పాదములపైఁబడి లలిత యిట్లు వేఁడుకొను చుండెను.

లలితమందిర ముండిన వీథియందే యాన్యాయస్థాన ముండెను. అపుడపుడే విషయచర్చ ప్రారంభమగుచుండెను. ఉద్యోగశాల ముంగిలిభాగమందు నిలిచి డఫేదారుఁడు లలితాంబా! లలితాంబా! లలితాంబా! యని యఱవసాగెను. ఆధ్వని తటాలున యువకుని వీనులసోకెను. అతఁడు లలితతో నిట్లనెను. "డఫేదారుఁడు పిలుచుచున్నది విన్నావా?"

ల—ఔను. న్యాయస్థానమం దభియోగమును విమర్శింతురేమో?

యు—ఐన నీయభిమానపత్రమందు నీ చేవ్రాలు చేయుము.

ల—(చేవ్రాలు చేసి) ఆ స్థానమునకుఁ దాఁ మే గదరా?

యు—పట్టపరీక్షయందుగూడను నెక్కుడు విజయము గాంచినాడను. నామండలమందలి యుద్యోగశాలలన్నిటికి నరుగ

నాకు స్వాతంత్ర్యముగలదు. ఇదే సన్నదుఁ జూడుము. ఇఁక నేఁ బోయివచ్చెద. నీకేమియును భయము లేదు.

లలితపక్షపు న్యాయవాది సత్వరమున న్యాయస్థానము నకేగెను. న్యాయాధ్యక్షుఁ డపుడే లలితయభియోగమునువిమర్శింప నారంభించియుండెను. పుత్రిపై శత్రుత్వము నారోపించిన సోమనాథుఁడు వాదిస్థానమందు నిలిచియుండెను. ప్రతివాది స్థానమం దెవ్వరును నిలిచియుండలేదు. న్యాయాధ్యక్షుఁడు ప్రతివాది లలితాంబయెచట? యని రక్షకభటులనడిగెను. ఇంతలో న్యాయవాది యరుదెంచి "ఆమెపక్షమున నేను స్వాతంత్ర్య పత్రిక నందితిని. ఇదే యది" యని యొక కమ్మనున్యాయాధ్యక్షున కందించెను. దానిని జదువుకొని న్యాయాధ్యక్షుఁ డామూలాగ్రముగా వాదివాఙ్మూలమును గొనెను. ఈ యభియోగమందు వాది విదేశవాసియగుట సాక్ష్యము లేదని ముందే తన దావాయందుఁ గనఁబఱచియుండెను. అభియోగము వాది ప్రతివాదుల పైననే యాధారపడియుండుటచేత న్యాయాధ్యక్షుఁడు న్యాయవాదితో నిట్లనెను.

న్యా.ధ్య—వాదివాఙ్మూలము విన్న మీ రేమి సమాధాన మొసఁగెదరు ?

న్యా.వా—అభియోగము కల్పనయని నొక్కివక్కాణించెదను.

న్యా.ధ్య—ఆధార మేమైన నున్నదా ?

న్యా.వా—వాది, ప్రతివాదికిఁ దండ్రికావలయును.

న్యా. ధ్య—చిత్రముగానున్నదే! (వాదివంకఁజూచి) ప్రతివాది, నీపుత్రికయేనా?

వాది—ఔను.

న్యా ధ్య—ఆమె యిప్పుడెచటనున్నది?

ఈపట్టణమందే బాలికాపాఠశాల నుపాధ్యాయినియై యున్నది.

న్యా. ధ్య—పుత్రియైయుండి తండ్రిసొత్తుల నపహరించునంతటికార్య మామె కేల యొదవినది?

వాది—ఏమియుండును? దురాశాపిశాచ మామెను బట్టియుండుటచేతనే.

సోమనాథుడిట్లు న్యాయవాదితో లేనిపోని దోషారోపణము లెన్నియో యారోపింపఁజొచ్చెను. సహింపలేక న్యాయవాది యీయభియోగమున కిదొకనిదర్శనమని న్యాయాధ్యక్షున కొకలేఖనిచ్చెను. లేఖావృత్తాంతమంతయు పాఠకు లిదివఱకే చదివియుండిరి. న్యాయాధ్యక్షుఁడాలేఖను దిలకించి మరల మరల యోజించి యందలివిషయమర్మముల నాలోచించి యిట్లనెను.

న్యా. ధ్య—ఈసంతక మెవ్వరిది?

న్యా. వా—ప్రతివాదిస్థానమం దుండవలసిన లలితది.

న్యా ధ్య—ఈలేఖ యెవరికై వ్రాయఁబడినది?

న్యా. వా—ముందే తనశీలమును వేఱొకని వశముచేసిన యాత్మనాధునకు.

న్యా. ధ్య—అతఁడిప్పు డెచటనున్నాఁడు? వాఁడుండుటచే నీ విమర్శనమునకు సాక్ష్యం బొసంగునేమోయని.

న్యా. వా—దానినంత లాభకరమని నాకుఁ దోఁచదు.

న్యా. ధ్య—ఈలేఖ కల్పితమని న్యాయాధ్యక్షు లేలసంశయింపఁ గూడదు?

న్యా. వా—ప్రతివాది వ్రాలంమున్నది.

న్యా. ధ్య—మీరే యీవ్రా లేలకల్పింపఁగూడదు. ఈ లేఖ మీకరమున నెట్లుపడినది.

ఈప్రశ్నమునకు నుత్తరమిచ్చుటకు న్యాయవాది కేమియుఁ దోఁపలేదు. వ్యాజ్యమందలి స్వభావమును గుఱ్ఱెఁగిన్యాయవాది సాక్షివోలె నిట్లుఁ జెప్పనారంభించెను.

"న్యాయాధ్యక్షకా! వ్యాజ్యమునువిమర్శించుటచేత విషయమంతయును నిదిసత్య మిదియసత్యమని మీమానసమున కెక్కి-యేయుండును. ప్రతివాది నిరపరాధినియని నిరూపించుటకు నామనవికూడ నొకయూఁతకోలగా నుండునని తలఁచుచున్నాను వాది మధుప్రియుఁడు. తన్మూలమున నున్మత్తుఁడై యుండెను. శీలవతియగు నితనికళత్ర విూయవమానమును భరింపలేక కృశించి కృశించి కాలగతినొందెను. అంతట అతని కుటుంబము విచ్ఛిన్నమయ్యెను. పుత్రుఁలోకదారిఁబోయిరి. పుత్రి స్వదేశమును విడి ఝాపట్టణమందు కాపురమును గుదుర్చుకొనెను. దేశదిమ్మరియై తుదకీ మహానుభావుఁడు పుత్రినే

యాశ్రయించెను. తండ్రియని యామె కడు ప్రేమతో నాతనిని జూచుచుండినది. తమయూస్థానమందలి రఘునాథుఁడను నొక యుద్యోగి కీమెను ముడివేయ నితఁడు కడుఁదొందఱ పెట్టినట్లు వినియుంటిని. ఇతఁడు కమలాపురమునందలి రమేశునకు వియ్యంకుఁడు. రమేశునకు హరిదాసనెడి యొక తనయుఁడు గలఁడు. మున్ముందే యాతని కీమె గాంక్షించియుండెను.

"విధివిధాన మిట్లున్నది. శీలభంగమునకోడి యామె కొంతవఱకు తండ్రిని గసరినది. తండ్రియాజ్ఞ నొల్లకపోవుటయె యీయభియోగమునకుఁ గారణమైనది. కాని ప్రతివాది నిరపరాధినియని వ్యాజ్యమునుండి తొలఁగింపఁ బ్రార్థించుచున్నాను."

న్యాయాధ్యక్షుఁడు న్యాయస్థాపకుని విమర్శనమంతయు ను వినుచుండెను. కాని నడుమనడుమ నాతనిమానసము రఘునాథ సోమనాథులపక్షము జయముగాంచిన బాగుండుననియే యాలోచించెడివాఁడు. కాన నతఁడపు డిట్లనియె

న్యా. ధ్య — ఈలేఖ హరిదాసునకు వ్రాసినదని మీ తలంపా?

న్యా. వా — ఔను. ఔను.

న్యా. ధ్య — అతఁ డీయభియోగమునకు సాక్ష్యమొసంగిన ప్రతివాదిపక్షమున విజయముగాంచుట కొక యాధారముండునని దోఁచుచున్నది.

న్యా వా — ఆహరిదాసే యీన్యాయవాదియని చెప్పమీకు వినోదము జనించును.

సోమనాథునిమోము వెలవెలబోయెను. యువతీయువకుల యన్యోన్యానురాగమిట్టిదిగదా యనుభావము న్యాయాధ్యక్షుని హృదయమం దంకురింపఁజొచ్చెను. రఘునాథునకు హితమొనర్ప నారంభమున సూచించెనుగాని, తుదకది యాతనికసమ్మతమని తోఁచెను. ఎట్టకేల కాలోచించి లలిత నిరపరాధినియని తీర్మానమొసఁగెను, పాఠకులారా! లలితా సోమనాథుల వాదప్రతివాదములను విపులముగా వ్రాయుట మాయభీష్టమైనను గ్రంథవిస్తరభీతిచే నీప్రకరణము నింతటితో విరమించితిని.

---

# పదునేడవ ప్రకరణము

---

చెన్నపురి సముద్రపుయొడ్డున నొక యౌవనుఁడు నిలిచియుండెను. అతఁడెవరో మనకిపుడు తెలియదుగాని యది సంధ్యాసమయమగుట చండకరునితీక్ష్ణకిరణములు జరాభారపీడితములైనట్లుండెను. ఉదధిమధ్యమునుండి యేతెంచుతరంగములు పరంపరలుగా తిప్పలు, గుట్టలు, కొండలు, పర్వతములవలె వచ్చుచుండెను. వానిపై యువకునిదృష్టులు ప్రసరించినట్లుండెను. ఆబడ్డునకు గొంచెముదూరమునందు జాలరులు గాలముయొడ్డి మత్స్యములఁ బట్టుటఁగాంచిన నాతనికది యొక యబ్బురముగా దోఁచుచుండెను. పశ్చిమదిశాంగన యలంకరించిన చొగావిచీరయో యన సంజకెంజాయ లందం

దుఁబ్రబలి సముద్రమున ప్రతిఫలించుటచే నాప్రతిబింబమును జూచినయువకుఁడు సంధ్యారాగ ద్వయంబేమో యని భ్రమపడి నట్లుండెను. ఒక్కొక్కతఱి నాతఁడు తనదృష్టులను నోడరేవుపైఁ బరపుచుండెడివాఁడు. ఐరోపాఖండమునుండి యేతెంచునోడలఁగని యందలి యెగుమతిఁ దిగుమతులఁ దిలకించుచు నాశ్చర్యపడుచుండెడివాఁడు. అప్పుడే ప్రయాణమునకు సిద్ధమైయున్న యోడఁ జపాన్ప్రయాణము తూగించుసమయమైనదనియు మిత్రులవలెని జపాన్ దీవుల కేగెదనేమోయనియుఁ ద్వరగతినందుఁబోయి జూచుచుండెడివాఁడు. ఖండాంతరమునుండి వచ్చుయోడ లడ్డదిడ్డములఁ బోక రేవునందే దిగుటకుఁ దగిన మార్గమును సూచించెడి యొక గొప్ప స్తంభముపై విద్యుచ్ఛక్తి దీపమునుగాంచి దానియద్భుతమున కచ్చెరువొందుచుండెడివాఁడు. మరల వెనుక కేతెంచి రక్షకభటశ్రేణిచే రాణించు సెంటుజార్జికోటంగని దానిరచనానైపుణ్యమును వేనోళ్లఁ బొగడుచుండెడివాఁడు. అందుండి సమీపవిగ్రహమును గాంచి దానిపేరేమని యందుండి వినోదములు జూచుచుండిన జనుల నడుగుచుండెడివాఁడు. అది క్రిష్ణస్వామి అయ్యర్ గారి విగ్రహమని దెలిసినతర్వాత నా శిల్పిచేతిపనికి హర్షించి ముందు వినబడుచుండెడి యాంగ్లవాద్యము శబ్దమాలించి వీనులకు విందును గూర్చుచుండెడివాఁడు. ఆతఁడట్లించుకసే పందుండి మనసున కెద్దియో యాలోచనంబు గదుర సత్వరగతి తిరువళ్లికేణి యొద్దఁ జేరి యందొకశిలావేదికపై గూర్చుండి యేదియో యాలోచించుకొనుచుండెను.

చెన్నపురి వాసులు సంజవేళలందు వాయుసేవనము నకై సముద్రపుటొడ్డున కరుదెంచుట వాడుక. తిరువళిక్కేణి యొడ్డునకు సమీపమందు రెండువందల గజముల పొడవును, నంతియె వెడల్పును, గలిగిన యొక యిసుకమైదానముఁగలదు అది వాయుసేవనమున కనువగుస్థల మగుటఁ బ్రజలు గుంపులు గుంపులుగా మోటరుబండ్లమీదను, గుఱ్ఱపు బండ్లమీదను వచ్చి యామైదానము చెంతదిగుచుండిరి. కాని వేదికపైఁగూ రుచుండిన వయసుకాఁడేలకో ప్రేక్షకుల యానందమందు భాగ్గానక యొకపరితన చూపులను పురిచాయలఁ బంపుచుండెను. వేఱొకసమయమున నధోవదనుఁడై చింతిల్లుచుండెను. ఆలో చనంబు దోఁచమినెడనెడ ఆకాశమువంకఁ జూచుచుండెను. వేస టనొందినవానివలె యాతనికి నుచ్ఛ్వాసనిశ్వాసముల ధాటి లెక్కుడగుచుండెను. మరియు నానాదిక్కులఁ బరికించుచుం డెను. ఈయవస్థల నన్నింటిని గాంచిన నితఁడేరికొఱకో వేచి యుండునట్లు తోఁచకమానదు.

ఇట్లుండనొక యరగంటకాలమునకు నొకజవ్వని వా యుసేవనమునకై యొకయుత్తమంబగు యశ్వశకటము నారో హించి యాతలమున కరుదెంచుచుండెను. దూరమునుండి యీామె యాగమనమును గాంచుచుండినయువకుఁ డు తటాలున లేచి యామె నెదుర్కొనబోయెను.

కడచిన ప్రకరణములందు లలిత చదువరుల హృదయము లను జాలిగొల్పుచునే యుండెను. ఇప్పుడు శ్యామలయను సతీమతల్లి మహాశయుల మనోదృష్టియందు ప్రత్యక్షమైనది. ఇరువురు సౌందర్యవతులే, సమానవయస్కలే, నిండుజవ్వనులే, వీరి యంగంపుసొబగు నేమి గుణాగుణముల నేమి, భేదాభేద ముల నేమి, మెచ్చుతగ్గుల నేమి పాఠకులు తమలో విమర్శింప కడునుత్సహించుచుందురు. లలిత లావణ్యరాసి యని జెప్పి యుంటిమి. శ్యామల స్ఫురద్రూప. శోభనాంగియని యిప్పుడు నొక్కి చెప్పుచుంటిమి. లలిత కుటిలాలక. శ్యామలవినీల దీర్ఘ కుంతల. లలిత పూర్ణేందువదన, శ్యామల యరవింద సుంద రానన. లలిత కువలయదళనయన. శ్యామల శతపత్రే క్షణ. లలిత కోకిలాలాప. శ్యామల శుకవాణి. లలిత మంద గమన. శ్యామల మరాళగమన. లలిత మృదుపాదపద్మ. శ్యామల పల్లవసుమసదృశపాద. లలిత యెలమావిగున్న శ్యామల లేతపొన్నగున్న.

చదువరులారా! ఈయన్నులమిన్నల యలంకారమునకిది వన్నెవెట్టు వర్ణనము గాదు. మఱేదియని మీరడుగుదురేమో? సౌందర్యమునకుదోడు గుణము, గుణమునకుదోడు శీలము, శీలమునననుసరించి ప్రతిష్ట. ఇంకేమిగావలయు?

లలితసద్గుణగణవిరాజమాన. శ్యామల ధారాళదాన పారీణ. లలిత శాంతస్వభావ. శ్యామల గంభీరస్వభావ. లలిత

వినయభాషిణి. శ్యామల స్వచ్ఛమత్కారిణి. లలిత సౌజన్యస్వరూపిణి. శ్యామల తేజఃపుంజసంపూర్ణ. లలితామూర్తి కుటుంబయాత్రను సుఖముగ సాగించునది. శ్యామలావిగ్రహము కుటుంబపోషణమున కంత దగినదికాదు. లలిత గృహదీపిక. శ్యామల కాచపాత్రప్రదీపిక. లోకమున నొకరుండిన కొల్లొకరుండరు.

లలిత హరిదాసును ప్రేమించియుండెను. ఆవాత్సల్యమపారమైనది, ఆస్నేహ మత్యధికమైనది, అదియామె జీవితమంతను, సంతోషసాగరమున దేలించునది, తరుణమున శ్యామల తనప్రీతి నొకయువకునకు ధారపోయనుండెను, అవెవాత్సల్యము కేవలము బాహ్యాడంబరము. మనము మరల నీకథాసరణి ననుసరించుచున్నాము,

వారొకరికొక రభివందనము లొనర్చుకొని, కుశలప్రశ్నలచే నానందించుచు నిర్జనప్రదేశముగానుండు నొకయిరుకాదరింబట్టి నడచుచుండిరి. ఒక్కింతసేపటికి యువకుండిట్లు ప్రస్తావింప దొడంగను.

య—శ్యామలా! నీయభీష్టమును మీతండ్రి కెఱింగించితివా?

శ్యా—ఒక యంతరాయమువలనఁ దెలుపనైతి.

యు—ఎట్టియంతరాయము? ఎవరికి?

శ్యా—వారము దినములనుండి నాతండ్రి జబ్బుపడినట్లు లేఖ లేతెంచుచున్నవి. దానమానసము స్థిమితముగాలేమి ఆవిషయమాపినదాన.

యు—అట్లయిన మీయూరికిఁ బ్రయాణము సాగింతువా?

శ్యా—పోవలయుననియే నాతలంపు.

యు—ఎప్పుడేగెదవు?

శ్యా—ఉదయ మూరుఘంటలకు.

యు—మీతండ్రి యారోగ్య మరయ నే నాతురుఁడఁగాన నీ వేగినపిదప నాకొక లేఖ వ్రాయుదువా?

శ్యా—తప్పక వ్రాయుదును.

యు—నీవట్లు గావింతువేని నే నొకతూరి నీ గ్రామమునకే తెంతును.

శ్యామల నిరుత్తర యయ్యెను.

యు—"నే నరుదెంచుట నీ కభ్యంతరమా?"

శ్యా—"మీరరుదెంచుట నాపుణ్యఫలమని తలఁచెద."

యు—"అయిన నీవేల మౌనమూనితివి?"

శ్యా—"మాతండ్రి కీవిషయమెఱింగింప జంకుటవలన."

యు—"నే నెఱింగింతునా?"

శ్యా—"ఎట్లెఱింగింతురు?"

యు—"లేఖామూలమున."

శ్యా—తొలుదొలుత నేనేగి యచ్చటిస్థితిగతులఁ దమకెఱింగించుదనుక దామిట్టి ప్రయత్నమునకు గడంగకుండుటయే నా ప్రార్థన.

వీరిట్లు సంభాషించుచు, నడచుచు శ్యామల నెక్కించుకొనివచ్చిన యశ్వశకటమున్న ప్రదేశముఁ జేరిరి. చాలపొద్దయినదని శ్యామల యువకుని సెలవుఁగైకొని శకటారోహయై గృహమునకు వెడలిపోయెను.

---

# పదునెనిమిదవ ప్రకరణము

---

కమలాపురమునందు హరిదాసుహృదయము చింతాంబుధినిమునింగియుండెను. అతని కిప్పు డాహారము రుచించుట లేదు. లలితజీవితమును గుఱించిగాని, యామె క్షేమోదంతమును గూర్చిగాని యతఁడించుకేనియుఁ చింతించుట లేదు. చిన్ననాటనుండి తన్నుమన్ననఁబెంచిన తండ్రి, తన్ను విద్యావంతునిగఁ జేయుటకై వేనవేలరూప్యములు వ్యయపఱచిన తండ్రి, అనవరతము కనుఱెప్ప వలెఁగాచిన తండ్రి, తనకష్టసుఖములందెల్లను పాల్గొన్న తండ్రి, ఇంతేల! తనయుని ప్రాణమే తన ప్రాణమని యెంచిన తండ్రి, మన్యపు జ్వరపీడితుఁడై దుఃఖభాజనుఁడై కృశాంగుఁడై యెల్లవేళల పరుపంటియుండ, పాపము! హరిదాసు మానసమెట్లు నిశ్చలమై యుండఁగలదు? ఎట్లు శాంతిఁగనఁగలదు? ఆహార మెట్లురుచింపగలదు! తండ్రి యనారోగ్యవంతుఁడై యుండుటచే నతఁ డెందఱో వెజ్జులను రావించి రోగమును నిర్మూలింపఁదగు ప్రయత్నముఁ జేయుచుండెను. కాని యాప్రయత్నములన్నియు విఫలములై నానాఁట వ్యాధి

యధికమై, రమేశుఁడు పరుపునంబడి పరితపించుచునేయుండెను. తండ్రి శుశ్రూషలకై హరిదాసొక సేవకుని నియమించి యుండెను. ఊడిగముల నొనర్చుదాసుల నెందరినో గాంచితిమి కాని యజమానుని కనుచూపులే యాజ్ఞలుగా భావించి, శరీరమును దాఁచక వేసట కలయక, కష్టనిష్ఠూరములను లెక్కగొనక శుశ్రూషాధర్మములను నెఱవేర్చుచున్న సేవకులందీసేవకుఁ డగ్రగణ్యుఁడని నిస్సంశయముగా వ్రాయ మాకలమేమాత్రము వెనుదీయుటలేదు. హరిదాసురమేశుల భాగ్యవశముచేతనే యీసేవకుఁడు లభించెనని చెప్పిన నదంతయతిశయోక్తిగాదు.

అతనిపేరు కోమలుఁడు. నామమునకుఁ దగినలావణ్యవంతుఁడేకాని వీనిదురదృష్టవశమున, వాఁడు సేవకావృత్తిచే జీవితమును గడుపుకొనవలసి యుండెను. కష్టకాలమే తెంచి యిడుమలుఁ గుడుచువేళ లాదవినపుడెట్టిసౌందర్యము లుండిననేమి? ఎంతచాకచక్య మున్ననేమి? కష్టములు నష్టములుగను, నష్టములు కష్టములుగను పరిణమించుట వానివానిధర్మము ననుసరించి జరుగుచుండును. కోమలుఁడు తనశుశ్రూషాధర్మమిట్లు నెఱవేర్చుచుండెను.

రమేశునిశయ్యాచెంతఁ బీఠములపై మువ్వురుయువకులు గూర్చుండియుండిరి. అందులో నొకడు కథానాయకుఁడగు హరిదాసు. హరిదాసు తండ్రియాననమునే నిరీక్షించి చూచుచుండెను. కోమలుఁడు రోగిని కడుజాగరూకతతోఁ గనిపెట్టు

చుండెను. కాని యేలొకో వాఁడపుడపుడు పీఠములపైఁగూ
ర్చున్న మఱియిరువురియువకుల నెగాదిగఁ జూచుచుండెను. ఒ
క్కొక్కతఱి వారితో మాటాడనుంకించుచుండెను. పాపమత
డేమిమాటాడఁ దలఁచుచుండెనో కాని రమేశునకు వ్యాధిబాధ
మెండై యుచ్ఛ్వాస నిశ్వాసముల ప్రచార మెక్కుడయ్యెను. అ
దియంతకంత కతిశయించుకొలఁది కన్నులుపచ్చనై కానరామి
రమేశునకు జగమంతయుఁ గుమ్మరసారెవోలెఁ దిర్దిరఁ దిరిగి
నట్లుండెను. అతఁ డిటునటుఁ గదలుటమాని చలింపక యుం
డెను. రోగాధిక్యముచే నాతనికన్నులు మూఁతలు పడిపోయె
ను. అంత నతనినోట మాటరాదయ్యెను. కోమలుఁడు తేటా
లున లోనికేగి యించుకక్షీరమును దెచ్చి గుటికెఁడు గుటికెఁ
డుగా రమేశునికంఠనాళమునుంచి బోవునట్లు ధారగా విడుచు
చుండెను. హరిదాసు రోగిశరీరము నిమురుచుండెను. మొదటియు
వకుఁ డంగవస్త్రమున విసరుచుండెను. రెండవవాఁడు పాదతల
మునఁ గూర్చుండి తైలమును మర్దించుచుండెను. రమేశునిగొం
తున వేసినపాలు వెనుదిరిగి వచ్చుచుండెను. అతని దేహము
నంతను స్వేద మావిర్భవించి దొప్ప దోఁగుచుండెను. ఆ స్వేద
మునంతయు కోమలుఁడు మెల్లగాఁ దుడుచుచుండెను. పాదతల
మున గూర్చున్న రెండవయువకుఁడు కాలుసేతులు చల్లనైనవ
నియెను. మొదటి జవ్వనుఁడు ముఖవికాస మంతకంతకుఁ దరు
గుచున్న దనియెను. ఇఁక నాశ లేనట్లున్నదని కోమలుఁడు
డగ్గుత్తికతో కన్నుల నీరునించెను. "హా! తండ్రీ! నన్నుం
టరిగ జేసితే"యని హరిదాసుఁడు రమేశునిపైఁబడి విలపింప

మొదలిడెను. హరిదాసుని యార్తారవంబు వీనుల సోకినంతనే "నాయనా! మమ్మందఱివీడి పరలోకమున కేగితివా"యని లోపలనుండి శ్యామల యేతెంచి యెదఁ బాదుకొనఁజొచ్చెను. ఒక్క తృటిలో నాభవనమంతయు రోదనధ్వనులతో నిండి పోయెను. ఏమయినను, కోమలుఁడు రోగివిషయమున నేమఱి యుండినవాఁడుగాఁడు. అతఁడు బల్లపైనుండిన బ్రాంది రస మొకచిన్నగరిటెఁడుగొని యతిబలవంతమున నారోగి గొంతు నందుఁ జొప్పింపఁజేసి "ఇంకను ప్రాణము దేహమును వీడలేదు మన మదృష్టవంతులమేయైన నితఁడు బ్రతికినను బ్రతుకవచ్చు ను. ఒకవేళ గతించునే యనుకొందము. మనము చేయునదేము న్నది. ఒక్కింత మీరందరు నూరడిల్లుట మేలు. రోగికి గొం దఱ యుండఁగూడదందురు." అని కోమలుఁడందఱిని బ్రార్థించి రోగికి దూరమునఁగూర్చుండఁ జేసెను. అందఱుఁ గొన్ని నిమిష ములట్లే రోగిని జూచుచుండిరి. కాలుసేతులం దుష్ణముగ్రమ్మఁ జొచ్చెను. శ్వాసనాళములగుండ నూపిరెక్కుడెక్కుడుగా రా గల్గెను. రోగియటు నిటుగదలఁ జొచ్చెను. మూఁతవడిన కన్ను లించుక తెఱచుకొనెను. కనుచూపు ధారాళముగ బ్రసరింపఁ జొచ్చెను. మాంద్య మంతరించి తెలివితేటలత్రోఁ బ్రకాశింప జొచ్చెను. "దాహము దాహ"మని రోగి యఱవఁజొచ్చెను. సంతోషస్వాంతయై శ్యామల లోనికేగి రజతపాత్రమున నుష్ణోదక మును దెచ్చి రమేశున కియ్యబోయెను. కోమలుఁడు తటాలు న వారించి జలమిపుడనవసరమని నొక్కి చెప్పెను. పాపము! రమేశుఁడు కోమలుని వంకజూచి నాలుకను జాపసాగెను. "కో

మలుఁడు" ఇదిగో జలమని ఘాటమగుమందు నొసంగెను. శరీర ముష్ణాధిక్యము గాంచుటచేతను, వెజ్జులొసఁగిన దివ్యౌషధముల చేతను, శ్యాముల యొసంగుపథ్యపానముల చేతను, కోమలుఁ డొనర్చు శుశ్రూషలచేతను రోగి యించుక స్వస్థచిత్తుఁడై కొన్ని దినములలోనే హరిదాసు సహాయ్యమున లేచి కూర్చుండి కోమలుని చెంతకుఁబిలిచి యిట్లు మాటాడఁ దొడఁగెను.

"కోమలా! నీవెవరో నేఁదెలియనైతి. నేనస్వస్థుఁడనైన దాదిగా నిర్మలమైన మానసముతో నాకుపెక్కుపచారము లొనర్చుచుంటివి. హరిదాసు నీ కేమి వేతన మొసంగునో యది నాకుఁ దెలిసినదికాదు. కుమారీకుమారుల కన్నను యీ నాకష్టదశయందు నెక్కుడు భక్తితో నను సేవించుచున్నవాఁడవు. నీసేవకానందనిమగ్నచిత్తుఁడ నగుటచే నీ కేదేనియొక బహుమతి నియ్యనెంచితి. ఆయీనాఁడుగూడ నీయిష్టము ననుసరించియే యీయఁ గాంక్షించుచున్నాడను. నాజీవిత మనుమానాస్పద మగుట దాని నిపుడే నీవడుగుకొనఁ గోరుచుంటిని. ఏమందువు?

రమేశునకు సమీపమందే బంధుమిత్రులందఱును గూర్చుండి యుండిరి. రమేశుని ప్రశ్నలకు ప్రత్యుత్తరంబిచ్చుటకై కోమలుఁడెద్దియో యాలోచించుచుండెనుగాని, యాలోచనఁ దోపమి హరిదాసుమోమునంకఁ దనదృష్టులుఁ బ్రసరింపఁ జేసెను. అదేమిరహస్యమో మాకుఁదెలియదుగాని హరిదాసు కోమలునిఁ బరికించి యేదియో కనుసన్నఁజేసెను. కోమలుని యాశయమునకు హరిదాసు కనుసైగ సూచనయై నట్లగపడు

చుండెను. ఈయాంతరంగిక ప్రశ్నోత్తరములు చెంతనుండిన దిద్ద్రిక్షుల కెరుకపడియెనో, లేదో మేము చెప్పఁజాలము. బద్ధాంజలుఁడై రమేశునితో కోమలుఁడిట్లనెను "ఏలికా! నాదొక విన్నపము. నేనొకవ్యక్తిరూపమున నున్న యనాథను. నన్ను సనాథగ నొనర్ప నభయప్రదాన మడుగుచుంటి. శుశ్రూషాధర్మము నాసహజకర్మమగుట మీ సేవ యొనర్చుచున్నవాఁడ. ఇపుడొసంగిన మీ వాగ్దానము నడప నిశ్చయించితి రేని అది ప్రమాణమని నాకభయమియ్య వేఁడెదను." కోమలుని వినయవిజ్ఞాపనము హరిదాసు నాంతరంగిక ప్రీతి నతిశయింపఁ జేయుచుండెను. అతఁడొకపరి కోమలునివంకఁ జూచుచు లోలోన హసించుచుండెను. చెంతఁగూర్చున్న యిరువురుయువకులు విషయవిచిత్రమును వినఁగుతూహలులై యుండిరి. ఇంచుక యాయాసముతో రమేశుఁడిట్లనెను. "కోమలా! నీమనవి పురుషరూపముననున్న స్త్రీవలె తేటవడియె. నీ సేవలఁ దనివింగన్నవాడనగుట నే నియ్యదలఁచుకొన్న దేదో ప్రమాణముగ నే నియ్యనుంటి. నీయీాడున కెనయగు నొకవరునకు నిన్నిచ్చి వివాహమొనర్చునట్లు నీవినయభాషణములఁ దేటపడియె. దాపక నీనిజవృత్తాంతమును వెల్లడించుము." కోమలుని నేత్రముల నుండి యానందభాష్పములు రాలుచుండెను. సంతోషాధిక్యము చేత హరిదాసు మేనంత యుఁగగుర్పొడచెను. కోమలునియుత్సాహమునకు మేరయే లేకుండెను. అపరిమిత సంతోషముచే తని మోమునం దొకవింతకాంతి జూపట్టెను. ఉత్సాహభర న పెదవు లదరఁజొచ్చెను.

రమేశుని చరణపద్మంబుల కెరగి కోమలుఁ డిట్లనెను. "నేను సోమనాథుని కూఁతురగు లలితను, విధివశమున నిట్లయితి"నని చెప్పి ముందేమియో చెప్పసాహసించెను. కానినోట మాటరాక శోకావేశమునఁ గన్నులనీరు గ్రమ్మ యామె నిర్విణ్ణయై నిలిచిపోయెను. చెంతఁగూర్చున్న యిరువురుయువకులు "చెల్లీ! నీవిట్లయితివా?" యని యామె నోదార్పఁదొడఁగిరి.

"అమ్మా! వీరిని నేనెఱుఁగ వీరెవ"రని రమేశుఁడు లలితనడిగెను. " ఇంతకుమున్న మొదటివాఁడు మాయన్న రాజవాహనుఁడనియు, రెండవవాఁడు తమ్ముఁడు రత్నాకరుఁడనియు గుర్తింపఁగలిగితిని."

"అది యిపుడు మీయెదుట ప్రత్యక్షమయ్యెను. మా కష్టములు తుదముట్టి మేమందఱ మిందుఁగూడినదినమే సుదినము.

ఇపుడు రమేశుఁడు తన చూడ్కిని హరిదాసుపై బ్రసరింపఁ జేసెను. హరిదాసుఁడు తండ్రియాననమును భయభక్తులతో వీక్షించి ముకుళితహస్తుఁడై యిట్లనెను. "తండ్రీ! లలితయందలి ప్రేమ చాలకాలమునుండి నామానసమును వేధించుచున్నది. ఇంతవరకు నీకతనాజ్ఞల కోడినిన్నడుగ భయపడుచుంటి. లలితపట్లనెట్లు బ్రసన్నుఁడవైతివో నాయెడనట్టి ప్రసన్నభావమే ప్రసాదించుము."

ఇంతలో శ్యామల "తండ్రీ! యీలలితయన్న (రాజవాహనుఁడు) మీకల్లుఁడు కాఁగోరుచున్నా"డని చెప్పి లజ్జనా

...ంచి యూరకుండెను. దైవసంఘటన మిట్లున్నదగుట నశ్లే...రుగగాతమని రమేశుఁడు వరముల ననుగ్రహించెను. అంద...ను నానందించిరి.

---

# పందొమ్మిదవ ప్రకరణము

---

మహాశయులారా! మనలలితకథ యింతట ముగిసినది. ...వ్యాధిబాధితుఁడై రమేశుఁడు ప్రాణాపాయమందుఁ జిక్కినను ...శుశ్రూషలవలనను హరిదాసునియాదరణవలనను రాజ...నరత్నాకరుల సహాయముచేతను దినదినారోగ్యాభివృ... సంపూర్ణసౌఖ్యమున మనఁగలెను. వామనజయం... ...న్నునకుఁ బాలయ్యకు పలువిధములగు... ...లితా హరిదాసుల యనురాగవృద్ధి ... ...ని చింతతోనే కాల... గడుపుచుండిరి.

...మునందలి పేరు... గన్న వారందఱు పైఁజెప్పిన ...చుండ... నాఁటి శుభముహూర్తమందు ...తా ...రిదాసులకును, శ్యామలా రాజ వాహనులకును, ...హా వైభవముతో వివాహములు జరుపఁబడెను.

సదానందభరితులై లలితా హరిదాసులు తమకుటుంబ... ...త్రిను సుఖముగాఁ గడుపుచుండిరి. శ్యామలా రాజవాహ...లు చెన్నపురియందు రక్షకభటయున్నతోద్యోగములందు

మెప్పువడసి సుఖులై కాలముఁ గడుపుచుండిరి. వారు అచిరకా
లములోనె రత్నాకరునకు వివాహ మొనర్చి ... నొక కుటు
బినిగాఁ జేసిరి.

సోమనాథుఁడు జాతికిభ్రష్టుఁడై, నీతికిదూరుఁడై, ...
ద్యమునకు నెలవై, దుఃఖమునకు భాజనుఁడై, లలిత తన్ను
జించినదాది, మరల బిచ్చమెత్తి "దేశద్రిమ్మరి"యయ్యెను. ...
తాగుబోతుతనములో కమునం జెన్ని కుటుంబములఁ దనపా
బెట్టుకొన్నదో, ఎందఱ మేధావంతుల నున్మత్తులుగఁ జేసినద
అట్టివారలెల్ల ఈ సోమనాథుని చరిత్రమును జదివిమధుపా
మును విసర్జింతురుగాక!

చూడుఁడు! సుస్థిరమానసికయగు లలిత తా
యిడుమలగుడిచినను దుదకుఁదాఁ మొదటవరిం
దన్నే వివాహమాడినది.

హరిచందుఁడు మా! ప్రేమైకభావుఁడని
నిరతుఁడనియు, మనకుఁ వెల్లడియగుచున్నది

కావున మా పాఠకులాలలితాహరి
ననుసరించి పవిత్రింతురని విన్నపము.

---

సంపూర్ణము.

PRINTED AT THE B. N. PRESS, MOUNT ROAD, MADRA



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA122B117 |
| పుస్తకం పేరు | లలిత |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 113 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | VI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |